జెప్పినాఁడు. ఇందలి యూతని "యుప్పర మెత్తుట"ను శ్రీ కృష్ణరాయాదులుగూడఁ గూర్చుకొనిరి.

## అసాధారణప్రయోగములు

శ్రీకృష్ణదేవరాయాదు లీగ్రంథమును బహువారములు పారాయణము చేసి యిందలి మేలిపలుకుబళ్లను తమగ్రంథములలో సమకూర్చుకొన్నారు. శబ్దరత్నాకరకారుల కీగ్రంథము దొరకలేదు గాన యిందలియసాధారణప్రయోగములను వారు సేకరింపఁజాలరయిరి. ఇందలి యట్టి యసాధారణప్రయోగములలోఁ గొన్నింటిని, వాని యితరకవ్యనుకరణములను, అర్థములను నిక్కడ చూపుదును.

గీ. జనని సంస్కృతంబు సకలభాషలకును
దేశభాషలందుఁ దెలుఁగు లెస్స — పుట-13

శ్రీకృష్ణరాయలవారు ఆముక్తమాల్యదలో దీనినే

ఎల్లనృపులు గొలువ నెఱుఁగవే బాసాడి
"దేశభాషలందుఁ దెలుఁగు లెస్స." — పుట-14

అని యుదాహరించుకొనిరి. గొజ్జంగిపూనీరు=పన్నీరు. జలపోసనము=మొలాము,నీరుపోయుట. జటిగొన్న=సరిగచుట్టిన. జరిగొన్న, సరిగొన్న, చరిగొన్న, జటిగొన్న రూపములలో నేది సరియో అర్థమింకేమో

అస్పష్టము. చూ. శ. ర చరికుండ. 'జటివోని (గోని?) గడితంపుఁ జిఱుత చౌకంబులతో గరుఁబుట్టము' 44 పుటలో ప్రయోగాంతరము. శివరాత్రి మాహాత్మ్యాదులలోఁ గూడ నిది గలదు. పుట 15 అక్కలఁజేయు=ముడుచు కొనఁజేయు. ఇరుచంబడు=సుదియుఁబడు. గుమ్మడి మాట = గుమ్మడిపండునాకృతిని గట్టినమాట. సుగ్గడి తము=సుఘట్టితము (వస్త్రము). తోఁపురెంటము= తోఁపువన్నె గలజమిలినూలిదుప్పటి. తట్టుపున్గు = నిద్ద మైనపునుఁగు. పు 17 కోటఁడు=గ్రుడ్లగూబ. మాఁగిలి మాఁగిలి=ఆఁచిరయాఁచి. పూఁగొమ్మ = పూఁగొమ్మ. వలతీరు=కుడివైపుగతి, ధర్మదార=యుద్ధాంతజ్ఞాపకముగా నూఁదుబాకా. దీని నూఁదినపిదప నిఁక యుద్ధము సేయరాదు. రెండుపక్షములును వైరమును వీడి ధర్మముగా వర్తిల్లవలెను. సంధి జరగిననో, ఏదేనొకపక్షము గెల్చిననో, ఉభయపక్షములకు విశ్రాంతి వలసిననో దీని నూఁదుదురు.

"విఱిగి పాఱఁదొడంగ వీరప నేఁడు
జయలక్ష్మి నేకొని స్వామివారి పుడు
దయ మీఱఁగా ధర్మదార వట్టించి
బంగారుబొమ్మను బాండ్యభూనాథుఁ
డింగితవేదియై యిచ్చిన మెచ్చి
తంజాపురము సేరి—"

రఘునాథాభ్యుదయము.

"మేటిదు నేదార్ల మెఱయఁ వజీర్ల
ఘోటకమత్తేభకోటులఁ జదివిం
పేలఁ బైపైఁ జొచ్చి యెల్ల శాత్రవులఁ
ద్రోలి పెన్గొండకుఁ ద్రోవల నూఁకి
...అని వేఁడుకొనిన దయాదృష్టిఁ జూచి
తనరు వేడ్కల ధర్మదార వట్టించి
సమరంబు సాలించి చయ్యన మరలి"

సౌగంధికాపహరణము కృత్యవతరణిక.

ఆముక్తమాల్యదలోఁ గూడ నీపదము గలదు. చూ 5 ఆశ్వాసము 150 పద్యము. కాని యం దీపదము నీయర్థముననే కవి ప్రయోగించె నని చెప్ప శక్యముగా కున్నది. ఆపద్యము నర్థమును భావమును స్పష్టముగా లేవు. ధార, దార పదములు వాద్యవాచకములుగా శాసనములందును గ్రంథములందును ప్రయోగింపఁబడి నవి. చేఁబ్రోలి శాసనము, బసవపురాణము చూడఁ దగును.

"భేరిడమామీలు పిల్లఁగ్రోవులును
దారలు గిడిగిళ్లు తమ్మటధ్వమలు
నపిరీలు రుంజలు నడవాద్యములును
విపరీతముగ మ్రోసె వినువీథి నిండ. పల్నాటివీరచరిత్ర.

పు 20. సొబగువీడు=ఋతువగు. పు 21. పచరించు= ప్రకటించు, వెల్లడిసేయు. దిస్సవాఱు=దిస్స (స్మిత

ధ్వన్యనుకరణము) మను. తీగనవ్వు=సాగిననవ్వు, ఈసీస పద్యమును రాధామాధవకవి యనుకరించెను.

సీ. కన్ను లార్చుచుఁ గొన్ని సన్నలు గావించుఁ
        దీగనవ్వులు నవ్వ దిన్నవాఁడుఁ
    బయ్యెద దిగజార్చి పాలిండ్లు పచరించు
        నతితి పేరులు చక్క నలవరించు
    గాజులచప్పుళ్లు గలుగల్లు మనఁజేయుఁ
        గొనగోళ్ల నందంద కురులు దీఁటు
    నీలరాగము నెలయించు నించుక జాడఁ
        దగవుమాటల జాణతనము లాడు.

రాధామాధవము 5 ఆశ్వాసము.

పు 23. వల్లువము=రొక్కపుజాలె. పు 24. పటితాళించు=బెళుకులార్చు, మైలసంత=ఊరి వెలుపల నుండు నిమ్నజాతులసంత, సురభేత్తు=సులువుగా రోమములు తొలఁగఁజేయునది. పు 25. సజ్జికపుఁజాయ=కసుగందని వన్నె? ఈపదమునర్థ మస్పష్టము. 'సజ్జికము' అని యిక్కడిరూపము. 'సజ్జకము' అని కొన్నిచోట్లఁ గలదు. ''జడగొప్పులోను నచ్చపుసజ్జకము లైనవిరవాదులకు'' ఉత్తరహరి. ఈ రెండు వేఱుపదము లేమో విచారణీయము. తొలుసమర్తయ=ప్రథమఋతువు. 'సమర్త' 'సమరత' రూపాంతరములు—'సమర్తయ' రూపమిది క్రొ

_త్తది. 'సమ_ర్త + అకాలంబు' అని ఛేదముసరిగాదు. పు 26. కుసుమ=కుసుంభావర్ణము. పు 27. పంచారించు=కుదురు నిండి నెలవుకొను, ఱెసిఘాత్వర్థము=ముద్దు. దిచ్చరించు=ఉబికి వచ్చు. పు 31. జంగాళము=జంఘాలము, హెచ్చు పొడుగు గలిగినది. మొరవంక కడియము=చేట వంపు (అందెవలె) గలకడియము? పు 32. తిరుపు టెద్దు= గానుగచుట్టుఁ దిరుగు నెద్దు. పు 33. గానుబది= తెలికిది. మోహరివాడ=సైనికులవాడ? పు 34. గోరఁటయొట్టులు= గోరంటాకు నెట్టున గలవి. పు 35. గనపపరిఖ, వ్రాఁతప్రతిలో 'కనపరిఖ' కలదు. గొప్పపరిఖ అర్థము గావచ్చును. వంకదార=పెద్దగవనికి ముందుండు మలపు ద్వారము. పు 36. అక్కలవాడ=వంటలక్కలవాడ, పూఁటకూళ్లమ్మలవాడ, ఈపద మిందు 63,87 పుటలలోఁగూడఁ గలదు. ఆము_క్తమాల్యదలోఁగూడ నీపద మీయర్థముననే ప్రయుక్త మయ్యెను. 'అక్కవాడల నరకూళ్లు మెక్కి' 7 ఆశ్వాసము. కాని యీగ్రంథమున నే 87 పుటలో 'అక్కలవాడలోని వెలియాంద్రకు' అని యుండుటచే నీపదమునకు వేశవాటి యనికూడ నర్థమేమో యని సందేహము తోఁచును. కాని యట్లుగా దనుకొందును. పూఁటకూళ్ల యిల్లవాడకు దగ్గఱగా వేశ

వాటిగాని, వేశ్యలయిండ్లుగాని యుండుట నేఁడును గలదు. అట్లే పూఁటకూళ్లమ్మలవాడలో వసించు వేశ్య లని పై పద్యచరణమున కర్థము గావచ్చును. లేక 'మేదరకరణ వేశ్య, కర్ణాట వేశ్య'యని యింతకుఁబూర్వము ప్రయోగించినట్లుగా నీకవి పూఁటకూళ్లమ్మలవాడలో వ్యభిచారవృత్తితోనుండుపూఁటకూళ్లఘోటఁతులనయినఁ బేర్కొని యుండవచ్చును. పు 40. త్రిక్కటి=త్రికాష్ఠి, తిగటము, ముక్కోణము? పు 41. గవుడపేరు=పెద్దహారము? గొప్ప రుద్రాక్షలమాలకు గవడరుద్రాక్షలమాల యని, గొప్ప రుద్రాక్షలకు గవడకాయలని నేఁడు వ్యవహార మున్నది. 'గవుడ'యని శ-ర. 'శానకకన్న' ఈపలుకుబడి శ్రీనాథోపజ్ఞమే యేమో? కేయూరబాహుచ్రిత్రమున మంచెన "చారుతరమూర్తి మందూకచక్రవర్తి" యనఁగా శ్రీనాథుఁ డిందు "చారుతరకీర్తి,బవనీలచక్రవర్తి" అనెను. ఇట్టిసంవిధానమున నేకులనుకరించిరి. "సకలగృహవర్తి మూషకచక్రవర్తి" "సకలగృహవర్తి మార్జాలచక్రవర్తి" ఇత్యాదివిధములఁ బ్రాచీనులే కాక శ్రీజార్జి చక్రవర్తి పట్టాభిషేకపద్యరచయితలలో నొకరు "సకలగృహవర్తి మార్జాలచక్రవర్తి" యని కూడ దీని ననుకరించిరి. పు 44. ఓలగందము—ఈపదమును

శ్రీనాథుఁడు పలుచోట్ల ప్రయోగించెను. 'చిఱు బంతిపసుపాడి' యనియుఁ గల యాతని ప్రయోగాంతర మునుబట్టి యీపదమునకు స్నానసమయమునఁ బూసి కొనెడు 'పసుపుపూఁత' యర్థ మగు ననుకొందును. సివ మెత్తినవారికి స్నానానంతరముగూడ నాపసుపును మొగమునఁ బూయుదురు. కాన యిక్కడ నాయర్థము సరి పడును. 'చిఱుతచౌకంబులతోఁగరుఁబుట్టము' పాండురంగ సుకవి దీనిని గైకొన్నాఁడు. "కట్టిరి చిఱుతచౌకముల క్రొంబుట్టముల్" దీనికి సరిగా నర్థముతోఁపలేదు. పు 45. ఎడపడడప=అప్పుడప్పుడు, ఈపలుకుబడిని శ్రీనాథుఁడు కాశీఖండమునఁగూడఁ బ్రయోగించెను. 'ఎడపడడప త నూభవుం డెచట నుండుఁ గానరాఁడని గృహాభర్తృ కాంత నడుగ' 3 ఆశ్వాసము. జీవగట్ట=వీణాతంతులకు కంబళిపిఁచు చుట్టి యాన్చి యుంచెడు పీఁటవంటికొయ్య, లేక శ్రుతిని హెచ్చుతగ్గులు చేయుటకుఁ దీగలను జుట్టి తుదిపట్టున గ్రుచ్చియుంచిన చెవివంటిబిరడా. పు 46. ఉరుమ=వాద్య భేదము, పిల్లదురులు=ధ్వనివిశేషము. పు. 48. చంద్ర మల్లెలు=చంద్రనిప్పులు, కరవాఁడి=చేసానపట్టినది, హాళాన్నాళము=బంగరు పిడిగలది ? నెట్టికసీల=అడ్డిగ సీల, కంఠాభరణము మరసీల. "అడ్డిగసీలంత ఉన్న

దో లేదో ఎంతమూ టన్నదో చూడు ఆపిల్ల" ఇత్యాది వ్యవహారము కృష్ణామండలమున నేఁడును గలదు. ఈపదము ఆముక్తమాల్యద, ప్రభావతీప్రద్యుమ్నము మొదలగు గ్రంథములందును బ్రయుక్త మయ్యెను. శబ్ద రత్నాకరకారులు ఆముక్తమాల్యదలోని "నెట్టన యల్లలచ్చి యల నీలయు భూసతి యుండ నీకు నీనెట్టిక నీలపై మనసు నిల్పుట కే మనవచ్చు" 7 ఆశ్వాస పద్యము నుదాహరించి యీపదమును 'నైష్ఠికశీల' పదపువికృతిగా భావించి సదాచారపరతంత్ర యని యర్థము వ్రాసిరి. కాని యీప్రయోగమునకుఁగూడ 'చిట్టిబొట్టికాయ'యనియే యర్థముయుక్తము. "అరయ నెట్టికసీల లంత లయ్యెను బింకమున బ్రహ్మశిఖ ముట్టుప్రోడ లార!" అని ప్రభావతీప్రద్యుమ్నప్రయోగము. పు 52. 'రెండెనిముదుల్' 'ఎనిమిదుల్' అనియో 'ఎనిముదుల్' అనియో కవిప్రయోగము. 'రెండుతొమ్మిదులు' అని కాశీఖండప్రయోగము గలదు. ఇక్కడఁగూడ 'రెండెనిమిదుల్' కావచ్చును. అట్లేని చిన్నయసూరిగారి సూత్రమునకువార్తికము చేర్చవలసివచ్చును. పు 53. తేఁడు= వెదకు, బాఁడు=బ్రాహ్మణుఁడు, దీనినిగూర్చి నేను ప్రకటించిన లక్ష్మీపురశాసనమునఁ గొంతపరిశీలనముగలదు. పు 54. తాలఁబోయు=తాలింపువెట్టు. కుటుబోడ.

బఱివోపు = పొద్దుమీఱు. పు 61. మయ్యెరక్ = వెంట్రుకతో?, ఇది శ్మశ్రుశబ్దవికృతిగావచ్చును. పు 62, అడియాలము = గుర్తు, అడి = పాదము, ఆలము = పల్లము, అడుగుపెట్టినచోటఁ బల్లముగ నేర్పడిన పాదచిహ్నము. ఇదివ్యుత్పత్త్యర్థము. ఈపద మఱవమునఁగలదు. పు 65. పుల్లసిలు = కందు. పు 66. లేఁబకు = లేఁతపసు. కోడె విధవల్ = పడుచువిధవలు. పు 74. తస్సి = డస్సి. తట్టువాఱు = చిదుకఁబడు. పు 75. మేంఠరాజు = గొఱ్ఱెఱేఁడు. పు 76. *నారికేళబకజాతీయంబులు = నారికేళ బకములను కొంగలను బోలినవి, కోడిపుంజులు. కొబ్బరిచెట్లపై వ్రాలు బకములకు నారికేళబకము లని పేరుండఁబోలును. తజ్జాతీయము లగుకోళ్లకా పేరుండఁబోలును. కేయూరబాహుచరిత్ర తెఆశ్వా. నారికేళబక మను కొక్కెరకథ గలదు.

క. కలిమిఁ దరము గానివ్యయం
బులు పేరిమ్ములకుఁ జేసి పొలియరె దుర్బ
ద్ధులు నారికేళబక మను
పులుఁగు దురైశ్వర్యమహిమఁ బొలిసినభంగిన్.

అని తదాది.

* అనుబంధము చూడుఁడు.

పు 80. ఆహిం వెట్టు = తాకట్టువెట్టు. పు 81. ఈఁగకును బోఁక వెట్టినయిట్టిభంగి = ..?82 "గుడిలోనుండియు గుడిఱాలను దీసె వీఁడు" ఈనానుడి పాండురంగమాహాత్మ్యమునఁ గూడఁ గలదు. పు 84. విడిముడి = భాగ్యము, లాఁతు = అధికము. ఈపద మాముక్తమాల్యదలోఁ గూడఁ గలదు. ఘటశాసిపుంగవుండు = శాస్త్రివర్యుఁడు, ఈపద మాముక్తమాల్యదలోఁ గూడఁ గలదు. "ఘటశాసుల శ్రోతులఁ దప్పుపట్టుదుర్" 7 ఆశ్వాసము, "శోమ్మనఘటశాసి శోంపయుఁ గమలె బమ్మనభట్టిల్లు భగ్గనఁ గాలె" బసవపురాణము 7 ఆశ్వాసము. ఇది నేఁటిశాస్త్రి, అవధాని బిరుదముల వంటిదిగాఁ బెక్కుశాసనములందును గలదు.

పు 86.

గీ. మాఘమాసంబు పులివలె మలయుచుండఁ
బచ్చడం బమ్మకొన్నాఁడు పణములకును
ముదితచన్నులు వాఁగ లేనిముర్మురములు
చలికి నొఱగోయ కేలుండు సైరికుండు.

ఈపద్యము సాతవాహన సప్తశతి 3 వ శతకము 39 వ గాథకుఁ దెలుఁగు

గా. విక్కిణఇ మాహమాస
మ్మిపామరో పాఇడిం వ ఇల్లేణ
ణిద్ధూమముమ్మురవ్వే అ
సామలియథణో పడిచ్ఛన్తో.

విక్రీణీతే మాఘమాసే
పామరః ప్రావరణం బలీవర్దేన
నిర్ధూమముర్మురనిభా
శ్యామల్యాః స్తనౌ పశ్యక.

తన తెనుఁగుసప్తశతినుండి యెత్తి యీపద్యమును శ్రీనాథుఁ డిందుఁ గూర్చుకొన్నాఁడు. పచ్చడం బమ్ముకొన్నాఁడు పసరమునకు అని పాఠమేని మూలమునకు సరిపోవును. పై పద్యమందలి "పొగ లేనిముర్మురము"లను పాండురంగసుకవి పరిగ్రహించినాఁడు. "పొగ లేనిముర్మురంబులు మగువలపాలిండ్లు భోగమహనీయులకుక" 4 ఆశ్వా. పాండు. ఒఱగోయు = ఒఱనుండి కత్తిని లాగు అనఁగా ప్రతిఘటించు. పు 89. సోణము = నాసాస్థి, సోడము రూపాంతరము, 'సోడంబుతో ముక్కు ద్రెవ్వఁగోసి' బసవపురాణము, 'సోణా లంట ఘోణాచ్ఛిదక' ఆముక్తమాల్యద. పు 97. దొరసెము? = పూర్వతరవత్సరము. పు 98. బడిసివైచు = దిగఁదుడిచివైచు, హారతిచ్చు "అటునది దొరసముద్రము । నిటునది యోర్గల్లు కడిఁది నినుకొండ మహా । పుటభేదనము-" అని ప్రథమ ముద్రణపాఠము. దీని కర్థము లేదు. శిథిల శిథిలమై యున్నమూలమును బరిశీలింపఁగా నేను బ్రకటించిన మంచిపాఠము గానవచ్చెను. 'కడిఁది నినుకొండ'

యని శ్రీనాథుఁడు ప్రయోగింపఁడు. ఆ గ్రామము పేరు వినుకొండ కాని యినుకొండ కాదు. ఈగ్రంథముననే యన్యత్ర 'శ్రుతపర్వతదుర్గ' మని వినుకొండ పేర్కొనఁబడెను. నేనీసంస్కారము చేయుట తప్పని యొకరు భారతిలో నాక్షేపించిరి. విజ్ఞత లిట్లు వెలయుచున్నవి!

## ముగింపు

బ్రహ్మశ్రీ మానవల్లి రామకృష్ణకవిగారు తిన్నఁగా మాబోంట్లు కన్నులు తెఱవకపూర్వము అనఁగా నిప్పటికిరువదేండ్లకుముందు అతిప్రశస్తము లయినయాంధ్ర గ్రంథముల ననేకముల గుర్తించిరి. అంత కింకను బూర్వమే శ్రీవీరేశలింగముపంతులుగారికిఁ గవులచరిత్ర ప్రథమభాగరచనమునను, ప్రాచీనగ్రంథప్రకటనముననుకడుం గడుఁదోడుపడిరి. వారు గుర్తించిన ప్రకటించిన యాంధ్ర గ్రంథములలోఁ గుమారసంభవము, నీతిసారముక్తావళి, క్రీడాభిరామము ననునవి రత్నత్రయము. త్రిపురాంతకోదాహరణము, శ్రీరంగమాహాత్మ్యము మొదలగు నవియు నుత్తమగ్రంథములు. సంస్కృతమునను వారు చాల విలువ గలగ్రంథముల వెల్లడించిరి, వెల్లడించుచున్నారు. సంస్కృతాంధ్రభాషాభిమానులు వారియెడఁ జాలఁ గృతజ్ఞులు గావలెను. వారియనుజ్ఞ గొనియే నేనీ

గ్రంథమును సంస్కరించి యుపోద్ఘాతము వ్రాసి యచ్చున కిచ్చితిని.

తంజావూరికిఁ బోయి యక్కడ తాటాకుఁబ్రతిలోని పాఠభేదములను ఇంకను నేవేవో నాకుఁ దోఁచిన విశేషములను సేకరించి వ్రాసి పెట్టుకొన్న దీనిప్రథమ ముద్రణపుఁబ్రతి నొకప్పుడు నేను బెజవాడ కరిగి యక్కడి రామమోహనగ్రంథాలయమునఁ గోలుపోయితిని. నే నక్కడ నుండఁగా దాని ప్రశంస మిత్రగోష్ఠిలో వచ్చెను. దానిని వారి కప్పుడు చూపితిని. ఆ తెలివిడిచే నెవ్వరో ప్రబుద్ధులు దాని నపహరించిరి. ఎందఱతోనో చెప్పితిని. ఎంతో తంటాలు పడితిని గాని నా కది మరల దొరకలేదు. ఈపీఠికాంత్యభాగము ముద్రిత మగుచుండఁగా దానినాఁటిపోకడతీరు గొంత నేఁటికిఁ దెలియవచ్చినది. ఏమి లాభము ! నే నందుకై మరలఁ దొందరపడి యప్పుడే తంజావూరి కరిగి తునాతునుకలై యున్నమాతృక నెట్లెట్లో పొందించుకొని లుప్తభాగములను, సాధుపాఠములను సేకరించుకొని వచ్చితిని. ఈతూరి మరల నెవ్వఁడేని యీప్రతి నెత్తుకొనిపోయెనా యిఁక దురుద్ధరమే క్రీడాభిరామము ! ప్రత్యంతర మిఁక లేదు! సాధుపాఠసంపాదన మిఁక శక్యము గాదు ! దేశ

చరిత్ర, సంఘచరిత్ర, భాషాచరిత్రాదులను బరిశీలించు వారికి బహూపకారకమయినది, శ్రీనాథరచితమయినది, ప్రశస్తరచనము గలది యన్నయభిమానముచేతనే దీని నిప్పు డిట్లు సంస్కరించి మరలఁ బ్రకటించుట. అంతేకాని దీనిలోని రోఁతవిషయములమీఁది ప్రీతిచేతఁ గాదు. పాము రుల కందకుండఁ బండితులకే విక్రయింతు మని ప్రకట కులు వ్రాస చేసిరి గావునను, గుప్తపఱచుట వ్యాప్తి నధిక పఱుచును గావునను, యథావస్థితముగా ముద్రించుటే మంచిదని పలువురు ప్రాజ్ఞు లభిప్రాయపడిరి గావునను దీనిని వికారపఱుపక యున్న దున్నట్లు ముద్రించితిని. ఈ పీఠికలోఁగూడఁ దుచ్ఛములయినను గొన్ని శ్రీనాథరచన ములను దచ్చరిత్రప్రయోజనమునుబట్టి, కవితాచమ త్కృతిమీఁది యాదరమునుబట్టి చేర్చితిని. శ్రీనాథకవి సార్వభౌమునిరచన లేవియుఁ జెడిపోకుండ నెలకొనియుం డుఁగాక యనియే నాకోరిక. ఆకవి యంత యభ్యర్హి తుఁడు. ప్రఖ్యాతాంధ్రవిద్వాంసులతోఁ బలువురతో యోజించి యీగ్రంథ మిట్లు ముద్రిత మగుట యెంతయు నావశ్యకమేయని నిశ్చయించితిని. విద్యావైదుష్యవిభవా ధికు లగునాంధ్రమహాశయులు గొందఱీ గ్రంథప్రకటన మునుగూర్చి యొసఁగినసదభిప్రాయముల నిందు జతకూ

ర్చుచున్నాను. పామరులకుఁ గాక ప్రమాణపత్ర మొసఁగిన పండితులకే విక్రయించుటకుఁ బట్టుదలతోఁ గట్టుదిట్ట ములతో వర్తింతురుగా కని ప్రకటకులను, పామరులకం టఁ బడకుండ నెక్కడఁ గాని దీనిమూలమునఁ జెడుగు గలుగకుండ భద్రపఱిచి యుంచుకొందురుగా కని దీనిని గొను ప్రాజ్ఞులను హెచ్చరించుచున్నాఁడను. ఏనూఱేం డ్లనుండి జీవముతో నున్నయీగ్రంథ మిఁక నంతరింపదు. ప్రాజ్ఞలోకమున కీగ్రంథము పరితోషము గూర్పఁగల దనియే నావిశ్వాసము.

విభవ
శ్రీకృష్ణజయంతి
7-9-28.

విద్వద్విధేయుఁడు
వేటూరి-ప్రభాకరశాస్త్రి

శ్రీః

# క్రీడాభిరామము



కృత్యవతరణిక

గణన కెక్కిన దశరూపకములయందు
వివిధరసభావభావన వీథి లెస్స
యేకవీంద్రుఁడు రచియించె నీప్రబంధ
మనుచు మీ రానతిచ్చెద రైన వినుఁడు. 1

కృతికర్తవంశవర్ణన

సీ. అఖిలప్రపంచంబు నన్యథా కల్పించెఁ
బఱురోష రేఖ సాఫల్య మొందఁ
ద్రైశంకవం బైన తారకామండలం
బాకాశమార్గంబునందు నిలిపె
మాలినీతీరనిర్మలసైకతములలో
మేనకాప్సరసతో మేలమాడె
నామ్నాయమాత గాయత్రీమహాదేవిఁ
బ్రణుతించి బ్రహ్మర్షి పదము గాంచె
నెవ్వఁ డాతండు సామాన్యఋషియె తలఁపఁ
దాటకాకాళరాత్రికి దాశరథికిఁ

గాలకంధరకోదండఖండనునకుఁ
గార్మ్యకాచార్యవర్యుండు గాధిసుతుఁడు. (2)

స్ర. ఆవిశ్వామిత్రుగోత్రం బనుజలనిధి యా
హ్లాదముం బొందుచుండన్
భూవిఖ్యాతప్రభావాభ్యుదయుఁ డు
దయముం బొందె* మాచంద్రకీర్తుల్
ద్యావాపృథ్వ్యంతరాళాంతరముల
నతినిస్తంద్రచంద్రాతపశ్రీ
ధావళ్యస్ఫూర్తి లక్ష్మీతరళితరకళా
ధౌళధళ్యంబు సూపన్. (3)

శా. ఆమంత్రీశ్వరుకూర్మినందనుఁడు చం
ద్రామాత్యుఁ డంభోజభూ
భామారత్నపయోధరద్వయతట
ప్రాలంబనై పథ్యము
క్తామాణిక్యనిభాభిరూప్యపదవా
క్యప్రౌఢసాహిత్యవి
ద్యామాహాత్మ్యవిలాససమ్మదితవి
ద్వన్మానసుం డిద్ధరన్. (4)

* ''మంచన్న'' అని యుండు నేమో.

శా. కర్ణాటక్షితినాథుఁ డైన పెదబు
క్కక్ష్మాపదేవేంద్రు న
భ్యర్ణామాత్యుని దానఖేచరునిఁ జం
ద్రాధీశు బంధుప్రియుల్
వర్ణించుల్ గవికోటి శంకరజటా
వాటీతటాంతర్నదత్
స్వర్ణద్యంబుతరంగరింగణలస
త్సాహిత్య సౌహిత్యమై. (8)

క. ఆచంద్రమంత్రిమణికిని
బోచాంబారత్నమునకుఁ బుట్టెను బుధర
క్షాచణుఁడు మంచనార్యుఁడు
వాచస్పతిసదృశబుద్ధివైభవుఁ డగుచున్. 9

సీ. మంచనార్యుతిప్పమకును సుపుత్రులు
నలువు రెన్న సింగనయును దిప్ప
నయును మల్లనయును నయనీతిసత్కళా
న్వితుఁడు చెన్నమంత్రివిభుఁడు ననఁగ.

గీ. సింగనామాత్యసుతుఁడు సుస్థిరగుణుండు
మానినీమన్మథుఁడు చంద్రమంత్రివరుఁడు
వెలసె వైభవముల దేవవిభునిఁ బోలి
సకలబుధతతి యెల్లను సంస్తుతింప.

9 క. మిరుతూరివిట్ఠమంత్రీ
శ్వరుతనయ వరించె మల్లసచివాగ్రణి శం
కరుఁ డద్రిరాజనందనఁ
బరిణయ మగుభంగి నధికభాగ్యోన్నతుఁడై.

10 ఉ. మల్లనమంత్రికిం ద్రిపుర
మాతరళాక్షికిఁ గాంతిరోహిణీ
వల్లభు లాత్మసంభవులు
వల్లభలింగనతిప్పనఘమా
వల్లభమంత్రిశేఖరులు
వారవధూజనపుష్పభల్లు లు
త్ఫుల్లయశోవిభాసితులు
పుణ్యులు సింగనభైరవేంద్రులున్.

11 వ. అందు

12 సీ. తారకామందారతారాచలంబుల
తో రాయు నెవ్వానిచారుకీర్తి
భావసంభవభద్రదేవేంద్రసూనుల
మఱపించు నెవ్వానిమహితమూర్తి
జీమూతవాహనశిబిసూర్యతనయుల
ధట్టించు నెవ్వానిదానశక్తి
భార్గవగార్గ్యగీష్పతిమతిప్రౌఢిమ
నిరసించు నెవ్వానినిశితబుద్ధి

యతఁడు రిపురాజరాజ్యసప్తాంగహారణ
కరణపరిణతయుక్తిప్రకాశమానుఁ
డతులితాచారవిజితగంగాత్మజుండు
మర్త్యమాత్రుండె వల్లభామాత్యవరుఁడు.

సీ. వాచాలసురధునీవీచికాగంభీర
వాచావిలాసుఁడు బైచమంత్రి
పల్లవోష్ఠీమానసోల్లాసకృతిపుష్ప
భల్లావతారుండు మల్లవిభుఁడు
పన్నగాలంకారపన్నీరజధ్యాన
సన్నుతాత్ముండు పోచన్నశౌరి
ప్రత్యగ్రసమాజసాహిత్యవిద్యాకళౌ
న్నత్యుండు తిప్పనామాత్యఘనుఁడు
నందనులు చంద్ర మందార కుంద కుముద
గంధకీ గంధసార సౌగంధ్యబంధు
బంధురోదారకీర్తి సౌభాగ్యనిధికి
మల్లికార్జున * మంత్రికి వల్లభునకు.

మ. కనకాద్రిప్రతిమానధైర్యనిధి లిం
గన్నోపమంత్రీంద్రుతో

* 'నుసుతునకు' అని యుండవచ్చును.

వనతారాతినృపాలమంత్రిజనతా
హంకారతారాహిమా
ర్కునితో రూపరతీంద్రుతో హరిహర
క్షోణీంద్రసామ్రాజ్యవ
ర్ధనుతో సాటి సమాన మీడు గలరా
రాజన్యసైన్యాధిపుల్.

15 గీ. తిప్పమంత్రి జగదుదీర్ణవితీర్ణుఁ డు
ద్వాహ మయ్యె నధికవైభవమున
హారితగోత్రజలధిహరిణాంకుఁ డగుతిప్ప
నార్యతనయఁ బెద్దమాంబ నెలమి.

16 స్ర. ఆమల్లామాత్యవర్యుం * డయుగనయనప్రా
జానుసంధానసంధా
సామగ్రీపుండరీకేక్షణుఁడు వెలసె నై
శ్వర్యసంపత్సమృద్ధిన్
సీమాదంతావళాభ్యుచ్ఛ్రితకరటతట
క్షేత్రనిర్యన్మదాంభస్
స్తోమవ్యాలోలభృంగస్తుతవిమలతర
స్ఫూర్తిసత్కీర్తిలక్ష్మిన్.

---

* 'మాత్యపుత్త్రుం డయుగ' అని యుండునేమో !

సీ. సత్యవ్రతాచారసత్కీర్తిగరిమలఁ
జంద్రుతోడను హరిశ్చంద్రుతోడ
నభిమానవిస్ఫూర్తి నైశ్వర్యమహిమల
రారాజుతోడ రైరాజుతోడ
సౌభాగ్యవైభవజ్ఞానసంపన్నత
మారుతోడ సనత్కుమారుతోడ
లాలిత్యనిరుపమశ్లాఘావిభూతుల
భద్రుతోడను రామభద్రుతోడఁ
బాటి యనదగు ధారుణీపాలసభల
వీరహరిహరరాయపృథ్వీకళత్ర
రత్నభండారసాధికారప్రగల్భ
మల్లికార్జునత్రిపురారి మంత్రివరుని.

మ. కపటాచారవిరోధిరాజసచివ
గ్రావోగ్రదంభోళికిన్
నృపనీతివ్యవహారకార్యఘటనా
నిర్ధారణాశాలికిన్
దపనీయాచలరాజధైర్యనిధికిం
ధర్మైకపాథోధికిం
ద్రిపురారాతిమహాప్రధానునకు నే
రీ యుద్ధు లిద్ధారుణిన్.

19 మ. అటవీసూకర మేల యేల ఫణి నో
లా కొండ లేలా దిశా
తట వేదండము లేల కూటకమఠా
ధ్యక్షుండు సప్తాబ్ధిసం
ఘటనాలంకృతమధ్య మైననిఖిల
క్ష్మాచక్రవాళంబు నె
క్కటి దాల్పం ద్రిపురారివల్లభుభుజా
కాండద్వయం బుండఁగన్.

20 ఉ. గంధవతీప్రతీరపుర
ఘస్మరపాదబిసప్రసూనపు
ష్పంధయచక్రవర్తి శ్రుత
పర్వతదుర్గమహాప్రధానరా
డ్గంధగజంబు తిప్పన య
ఖండితధీనిధి కాంచెఁ బుత్త్రులన్
బాంధవకల్పవృక్షముల
బైచన*మల్ల నతిప్పమంత్రులన్.

21 వ. అందు

కృతికర్తృప్రశంస

22 సీ. మూఁడుగ్రామగ్రాసములతోడఁ గూడంగ
మోపూరు పాలించె ముల్కినాట

* 'వల్లభ' అని యుండవలెను.

నాశ్వలాయనశాఖయందు ఋగ్వేదంబు
కరతలామలకంబుగాఁ బఠించెఁ
బ్రత్యక్ష మొనరించి భైరవస్వామిచే
సిద్ధసారస్వతశ్రీ వరించెఁ
గామకాయనసవిశ్వామిత్రగోత్రంబు
వంశగోత్రంబుగా వార్త కెక్కె
నెవ్వఁ డాత్రిపురాంతకాధీశ్వరునకు
రాయనవరత్నభండారరక్షకునకుఁ
బ్రియతనూజుండు చందమాంబికకు సుతుఁడు
మనుజమాత్రుండె వల్లభామాత్యవరుఁడు.

క. అహరవధిసమయనృత్య
త్తుహినాంశుధరప్రచారధూతాభ్రధునీ
లహరీభ్రమఘుమఘుమముల
వహిఁ దిప్పు వల్లభన్న వాగ్వైభవముల్.

క. హాటకగర్భవధూటీ
పీటీకర్పూరశకలవిస్మరసౌర
భ్యాటోపచాటుకవితా
పాటవ మరు దవని వల్లభన్నకు నమరున్.

క. హాల్లీసకనటనోద్భట
వల్లవ హరికృష్ణ కంఠ వనమాల్య మిళ

ద్గల్లత్ సురభులు తిప్పయ
వల్లభరాజప్రధానవాగ్వైభవముల్.

26 క. అమృతరసమథనసంభవ
ఘుమఘుమితపయఃపయోధికోలాహలముం
భ్రమియించుఁ దిప్పసచివో
త్తమువల్లభవిభుని చాటుధారాఫణితుల్.

22 క. భిల్లావతారమధుభి
ద్భల్లభుజాస్ఫాల్యమానపటుచాపజ్యా
వల్లీమతల్లి చెల్లెలు
వల్లభరాయప్రధానవాగ్వైభవముల్.

28 క. నెల్లూరితూముకాలువ
హల్లకములకమ్మఁదావి నపలాపించుం
సల్లలితలీలఁ దిప్పయ
వల్లభరాయప్రధానవాగ్డంబరముల్.

29 క. ఉపమించెద ధారాధర
తపనజ రైరాజ రాజ ధారానగరా
ధిప ధారాధర వాహులఁ
ద్రిపురాంతకవల్లభుని వితీర్ణిప్రౌఢిం.

30 క. సరి వత్తు రేవి నిర్జర
పరివృఢమణి ధనద జలద బలి ఖచర నిశా

కర సురతరు సురధేనువు
లరుదై త్రిపురారివల్లభామాత్యునకున్

శా. సారాచారమునన్ వివేకసరణిన్
సౌభాగ్యభాగ్యంబులన్
ధౌరంధర్యమునం బ్రతాపగరిమన్
దానంబునన్ సజ్జనా
ధారుం దిప్పనమంత్రివల్లభు ననూ
త్యగ్రామణిం బోల్పఁగా
వేరీ మంత్రులు సింధువేష్టితమహో
ర్వీచక్రవాళంబునన్.

సీ. మందారవారుణీమదఘూర్ణితాత్ముచే
వెడఁదకన్నుల చిన్నివడుపుచేత
డమరుఖట్వాంగదండకపాలపాణిచే
ధూర్తబాలకచక్రవర్తిచేతఁ
గుక్కురపరివారకోటిసేవితునిచే
వెలఁదికోఱలమోము వేల్పుచేత

(చరణము కొఱఁత)

విశ్వవిశ్వంబు పాలించువిభునిచేతఁ
బార్వతీదేవి గారాపుఁబట్టిచేత
నీప్సితము గాంచుఁ దిప్పమంత్రీంద్రతనయుఁ
* డర్మవణి వల్లభామాత్యుఁ డహరహంబు.

---

"దార్యమణి" అని యుండవచ్చును.

## ప్రేమాభిరామప్రశంస

33 వ. ఆ మంత్రిశేఖరుండు రావిపాటి త్రిపురాంతకదేవుం డను కవీశ్వరుం డొనరించిన ప్రేమాభిరామనాటకంబు ననుసరించి క్రీడాభిరామం బను రూపకంబు తెనుంగుబాస రచియించినవాఁడు.

34 గీ. ఆతఁ డెంతటివాఁడు ప్రేమాభిరామ
మనఁగ నెంతటియది దాని ననుసరించి
వీథి యనురూపకము మది వెఱపు లేక
తిప్పవిభువల్లభుం డెట్లు తెనుఁగుఁ జేసె.

35 వ. అని యానతిచ్చెద రేని

36 ఉ. నన్నయభట్టతిక్కకవి
నాయకు లన్న హుళిక్కిభాస్కరుం
డన్నను జిమ్మపూఁడి యమ
రాధిపుఁ డన్నను సత్కవీశ్వరుల్
నెన్నుదుటం గరాంజలులు
నింతురు జే యని రావిపాటితి
ప్పన్నయు నంతవాఁడ తగు
నా యిటు దోసపుమాట లాడఁగన్.

గీ. జనని సంస్కృతంబు సకలభాషలకును
దేశభాషలందుఁ దెనుఁగు లెస్స
జగతిఁ దల్లికంటె సౌభాగ్యసంపద
మెచ్చుటాఁడుబిడ్డ మేలుగాదె.

వ. నేపథ్యమున

కథాప్రస్తావన

చ. గతిరసికుండ ! షట్చరణ !
గానకళాకమనీయ ! యోమధు
వ్రత ! వికచారవిందవన
వాటిక నేమిటికిం బరిత్యజిం
చితి వటవీప్రదేశమునఁ
జెట్టులు సేమలు నేమి గల్గినన్
బతి చెడి సంచరించెదవు
ప్రాఁబడిపోయెనె నీ వివేకమున్.

గీ. చేర వచ్చివచ్చి దూరంబుగాఁ బోదు
డాయవత్తు దవ్వ పోయిపోయి
మాట లింక నేల మాపాలిటికి నీవు
మాయలేడి వైతి మంచిరాజ!

వ. ఆకర్ణించి సూత్రధారుఁడు హా ! యే నెఱింగితి
నేకశిలానగరంబునం దార్యవాటంబునం గామ
మంజరి యనుపునర్భువునందు బద్ధానురాగుండై

కార్యాంతరవ్యాసంగంబునం దేశాంతరగతుం
డైన కౌసల్యాటి గోవిందమంచనశర్మ నుద్దే
శించి యమ్ముద్దియ పుత్తెంచినయసంబంధభూత
ప్రేమసంధుక్షణాగర్భం బైనమదనలేఖసందేశ
పద్ధతి యది పఠియించుచున్నవాఁ డతనికట్ట
నుంగుఁజెలికాఁడు టిట్టిభసెట్టి గావలయు నయ్యి
రువురు నాబాల్యమిత్రంబులు వీరియోగక్షేమంబు
లనుసంధించెదంగాక యని నిష్క్రాంతుఁ డయ్యె
నిది ప్రస్తావన.

42 సీ. గన్నేరుఁబూఁజాయ కర మొప్ప నీర్కావి
మడుఁగుదోవతి పింజె విడిచి కట్టి
గొజ్జంగిపూనీరు గులికి మేదించిన
గంగమట్టి లలాటకమునఁ దీర్చి
వలచేత బంగారుజలపోసనముతోడఁ
బ్రన్ననిపట్టుతోరము ధరించి
జటిగొన్న వెలిపట్టుజన్నిదంబులలుంగ
యంటులు వాయంగ నఱుత వైచి
తళుకుచెంగావికోకయు వలుఁదశిఖయుఁ
జిగురుబొమ్మంచు పెడవులు చిన్నినగవు
నంద మొందంగ వచ్చె గోవిందశర్మ
మాధవునిపట్టి యొసపరిమన్మథుండు.

క. కౌసల్యాటి శ్రేష్ఠుఁడు
మీసాలప్పయ్యగారి మేనల్లుఁడు ధా
త్రీసురతిలకుఁడు కుసుమశ
రాసనసముఁ డంధ్రనగరయాత్రోన్ముఖుఁడై.

వ. తూర్పుఁ గనుంగొని టిట్టిభుని౦ జూచి వయస్య! సుప్రభాతంబు సుఖనిద్ర యయ్యెనే? శీతంబుప్రద్రవంబు వాయదుగదా యీపుష్యమాఘంబు లందు

చలి

ఉ. ప్రక్కలు వంచివంచి ముని
పంట్లను బంట్లను రాచిరాచి ఔ
మ్మక్కిలఁ జేసిచేసి తల
యల్లనఁ గాళ్లకు నందియుంది లో
చక్కికి నొక్కినొక్కి యిరు
చంబడఁ గుమ్మడిమూట గట్టి పీ
పిక్కదువాళి చేసి చలి
యిక్కడ నక్కడఁ బెట్టు వేకువన్.

ఉ. కుమ్ములు హావ్యవాహములు
గుత్తపుసుగ్గడితంపుఁదోఁపు రెం
టమ్ములు దట్టుపున్గు మృగ
నాభియుఁ జాఁదును నోడ నద్దిరా

యమ్మక చెల్ల! యింక నవ
యౌవనదర్పనఖంపచంబు తా
కొమ్మలచన్నులన్ సరకు
గొనటు లున్నవి వో తుషారముల్.

47 శా. స్థూలద్విత్రిపటావకుంఠనముఁ గ
స్తూరీరజఃపాలికా
కాలాగుర్వనులేపనంబులను ను
ద్ఘాటించి ధాటీగతిన్
బ్రాలేయంబు దువాళి సేసిన భయ
భ్రాంతంబులై యూష్మముల్
వాలాయంబుగఁ బ్రాఁకె నంధ్రవనితా
వక్షోజశైలాగ్రముల్.

48 శా. స్థూలద్విత్రిపటావకుంఠనములున్
ధూపోపచారంబులుం
గాలాగుర్వనులేపనంబులు వధూ
గాఢోపగూహంబులుం
గేలీగర్భనికేతనంబులును గ
ల్గెంగాక లేకున్న నీ
ప్రాలేయాగమ మెవ్విధంబున భరిం
పన్ వచ్చురా టిట్టిభా!

వ. శీతోపద్రవంబు లేక సుఖనిద్ర యయ్యెనే యని
యడిగి వేకువ యగుచున్నయది గావున నిదియ
మనకుఁ బ్రస్థానకాలం బని నిమిత్తం బనుసంధించి

శకునములు

ఉ. చుక్క యొకింత నిక్కి బల
సూదనుదిక్కున రాయుచుండుటం
జక్కఁగ వేగ దిప్పుడు ని
శాసమయం బిది ప్రస్ఫుటంబుగా
ఘుక్కని మాటిమాటికిని
గోటఁడు వల్కెడు వామదిక్కునం
జొక్కటమై ఫలించు మన
శోభనకార్యము లెల్లఁ డిట్టిభా!

క. మాఁగిలి మాఁగిలి వృక్షము
పూఁగొమ్మనుండి షడ్జము ప్రకాశింపం
దేఁగొదమ నెమలి పల్కెడుఁ
దేఁగోఁయని వైశ్య మనకు గెలుపగుఁ జుమ్మా.

గీ. కొనకొనం గోడి యేట్రింత కొంకనక్క
నమలి యీనాలుగిటిదర్శనంబు లెస్స
పీనివలతీరుఁబలుకు నుర్వీజనులకుఁ
గొంగుబంగార మంద్రు శాకునికవరులు.

కోడికూఁత

53 వ. అనిన నాకర్ణించి టిట్టిభుండు

54 ఉ. మంచన వింటివో వినవో
మన్మథుఁ డేకశిలాపురంబులోఁ
జంచలనేత్రలం బతుల
శయ్యలపై రతికేలి రాత్రి పో
రించి ప్రభాతకాలము ప
రిస్ఫుట మైనను ధర్మదార వ
ట్టించుచునున్నవాఁ డదె కు
టీగతకుక్కుటకంఠనాళముల్.

55 వ. అని యట వోయి ముందట

56 గీ. శీతకాలంబు కడి మూఁడ సేయఁ గుడుచు
భాగ్యవంతుండు జేపాడి పల్లెపట్లఁ
గ్రొత్తయోరెంబు నిగురావకూరతోడఁ
బిచ్చిలం బైననేతితోఁ బెరుఁగుతోడ.

ఒకముచ్చట

57 వ. టిట్టిభ! తలంపునం బాఱె నొక్కనాఁ డేనునుం గామమంజరియును బ్రేమంబెలర్పఁ గలసిమెలసి కూడిమాడి పొందిపొసఁగి యనఁగిపెనఁగి చొక్కి తక్కియుండ దైవవశంబున గోత్రస్ఖలనంబు కారణంబుగా నక్కాంతారత్నం బలిగిన

గీ. ఎట్టకేలకు నలుక రే యెల్లఁ దీర్చి
యువిద యధరామృతము గ్రోలుచున్ననాకుఁ
బానవిఘ్నంబుగా మ్రోసెఁ బాపజాతి
జాతిచండాల మైన వేసడపుఁగోడి.

వ. టిట్టిభ! యమ్మదనపట్టాభిషేక మత్తేభ రాజగమన నట్టనడుమ సురత కాలంబున వసంతసమయంబు నంబాసి మల్లికాధవళాట్టహాసమహాకాళమూర్తి యగు తపర్తుసమయంబు లంఘించి లాంగలీకుసుమ కేసరపరాగ రేణువిసరపిశంగిత దశదిశాహాట్టం బగువర్షాసమయం బెట్టకేలకుం గడపితిఁ బ్రావృట్కాలప్రవాసంబును మరణంబును రమణీరమణులకు నొక్క-సమంబ యది యెట్టిదనిన.

మ. పటుజంఝూపవనోత్థ్రణాలయములో
భద్రంబునం బట్టైకం
కటిపై ముచ్చముడింగి నిర్భరవియో
గగ్లాని శోషించి యె
క్కటి నిద్రించుచు నున్నపాంథవనితల్
గర్జావచఃప్రౌఢిమన్
బటిదుద్ద్యోతము చూపు నట్టనడురే
థారాధరశ్రేణికిన్.

61 వ. అని మంచన మఱియును బ్రాగ్దిశాంచలము వీక్షించి

అరుణోదయము

62 గీ. దాసనపుఁబువ్వుచాయతోఁ బ్రస్తరించు
చుదయమయ్యెడు నదె చూడు మొదలిసంజ
సొబగు వీడినఁ గట్టెఱ్ఱ సోఁకినట్టి
కామమంజరి నెమ్మోముకాంతివోలె.

సూర్యోదయము

63 మ. అదె మాణిక్యపుఁబూర్ణకుంభము వయస్యా! కార్యసంసిద్ధికై
మొదలం దోఁచినయట్టి మంచిశకునంబుం గా విచారింపరా
యుదయం బయ్యెడు భానుబింబము దిశావ్యోమావకాశంబులం
బదియార్వన్నెపసిండిటీగలగతిం బ్రాఁకెం బ్రభాజాలముల్.

64 శా. ఓరుంగంటిపురంబుసౌధములపై నొప్పారెడిం జూచితే
యీరెండల్ మణిహేమకుంభములతో నేకాంతముల్ సేయుచున్

స్వారాజప్రమదాఘనస్తనభర
స్థానంబులం బాసి కా
శ్మీరక్షోదము ప్రాణపల్లభదృఢా
శ్లేషంబులన్ రాలె నాన్.

65 వ. అనుదితనియమవ్రతంబు గావున నిట క్రితంబ సంధ్యాగ్నిహోత్ర క్రియాకలాపంబులు నిర్వర్తింపంబడియె నీవు ముఖమజ్జనంబు సేసి యిష్టదేవతాభివందనంబు గావించితివిగదా గోధూళిలగ్నంబునం బురంబు ప్రవేశింపవలయు విశేషించి యుషఃకాలంబు సర్వప్రయోజనారంభంబులకుఁ బ్రశస్తంబు.

66 సీ. గార్గ్యసిద్ధాంతమత ముషఃకాలకలన
శకున మూనుట యది బృహస్పతిమతంబు
వ్యాసమతము మనఃప్రసాదాతిశయము
విప్రజనవాక్య మరయంగ విష్ణుమతము.

67 వ. అని పరిక్రమించి వెలిపాళెంబు కట్టకడపటఁ గటకారకుటీరవాటికఁ బ్రవేశించి.

మేదరవాడ

68 సీ. ఎకసక్కెముగ నాడు నేదైన నొకమాట
పాడు నొయ్యన పాట పాటపాట

యులఁతియద్దపుబిళ్ల యలవోక వీక్షించుఁ
గొనగోరఁ బదనిచ్చి కురులు దీర్చుఁ
బయ్యెద దిగజార్చి పాలిండ్లు పచరించు
దిస్స వాఱఁగ నవ్వుఁ దీగనవ్వు
ధవళ తాళపలాశ తాటకంబులు త్రిప్పు
కలికిచూపులఁ జూపు గర్వరేఖ
కటకుటీద్వార వేణుకా(వైణవ?) కాష్ఠపీఠ
మధ్యభాగనిషణ్ణయై మదము మిగిలి
వీటి పామరవిటుల తం గేటిజున్ను
కాముబరిగోల మేదరకరణవేశ్య.

69 క. పుటభేదనబహిరంగణ
కటక(శ్రీ) కారకూటకటకం బగునీ
కట కారకులవధూటీ
కుటికాగారంబు గరడి కుసుమాస్త్రునకున్.

70 క. కీసిన వెదురుసలాకల
నేసిన యిరుఁదల శిఖండి నిడుమంచమునం
దోసరిలి కటకుటీరవి
లాసిని రమియించు మిండలసహస్రములన్.

71 ఉ. పల్లవతస్కరుం డొకఁడు
ప్రాక్సముపార్జితతారపంక్తితో

వల్లువ మెత్తికొంచుఁ బెడ
వాకిట వెళ్ళిననాఁటనుండి పా
టిల్లినశంక నీకటకు
టీరవిలాసిని యహ్హాహా ! పటీ
పల్లవకోణముల్ బిగియఁ
బట్టి రమించును మిండగీలతోన్.

72 వ. ఆచేడియం జూచి యట పోవంబోవ ముందట.

చండాలాంగన

73 శా. గండాభోగముపజ్జ లేనగవు శృం
గారింపఁ గ్రేఁగన్నులన్
మెండై మించుమెఱుంగుఁజూపుగమి క్రొ
మ్మించుల్ పిసాళింపఁగాఁ
జండాలాంగన వచ్చె నొక్క-తె ఋతు
స్నానార్థమై యిక్షుకో
దండుం డేర్చినబాణమో యనఁగ సౌం
దర్యంబు నిండారఁగన్.

74 వ. అట్లు పోవం బోవ ముందట.

కర్ణాటి

75 మ. కటిభారంబును జన్నుదోయిభరముల్
గల్పించె నాబ్రహ్మ పి

న్నటి కౌఁదీగకు మున్న యిష్టు విమలా
ర్ణఃపూర్ణమై యున్నయీ
ఘటిభారం బాకఁ డెక్కు డయ్యె ననిన౯
గర్ణాటి క్రొల్గన్నుల౯
బటితాళింపుచు నవ్వె నీలకబరీ
భారంబు కంపింపఁగా౯.

౭౬ వ. అనుచు గోవిందమంచనశర్మ నర్మసఖుం డగుటిట్టి
భుండును దానును హట్టమార్గంబునం జను
నప్పుడు.

౭౭ గీ. జిగురుటుండలు నించి డాచేతియందుఁ
బెద్దయేనుఁగుదంతంబు పెట్టెఁ బెట్టి
యింతులకుఁ బ్రీతిగా మైలసంతలోన
సుసరభే త్తని ఘోషించె జోటి యోర్తు.

౭౮ వ. ఇది యేమి ఘోషించుచున్నయది కిరాటకుల
రత్నంబ! నీవు తేటపడ నెఱింగి నాకు నెఱిఁగింపు
మనుచు మంచనశర్మ యడిగిన.

౭౯ చ. ముసిముసినవ్వుతో నతని
మోము గనుంగొని వైశ్యుఁడిట్లను౯
రసికకులావతంసుఁడవు
బ్రాహ్మణ! యింతకుము న్నెఱుంగవే?

యసమశరాలయంబునను
హ_త్తినవెంద్రుకకప్పు వోవఁగా
విసరుసమీరణం బయిన
వేడుకమం దిది గొందు రంగనల్.

80 సీ. కమఠావతారంబుఁ గైకొన్నదైత్యారి
కమనీయచరమభాగంబువోలె
నాదియుగంబునం దావిర్భవించిన
జిననాథదేవునిశిరసువోలెఁ
గసటు వోవఁగఁ దోమి కడిగి బోరగిలంగఁ
బెట్టినతామ్రంపుబిందెవోలెఁ
గంగమట్టియతోడ సాంగత్య మెడలిన
నునుపారుమునిమిట్టనుదురువోలె
జిఱుతప్రాయంపునాఁటిసజ్జికపుఁజాయ
తోలుసమ_ర్తయకాలంపువిలసనమునఁ
దరుణులకుఁ బంచబాణమందిరము లమరు
సురభే_త్తనునీమందు సోఁకినపుడు.

81 వ. ఇది నిర్వ్యాసమయంబును సరభేదన సమర్థంబును
నగుటం జేసి సురభే_త్తనునామంబు దీనికిం గలిగెఁ
గామనిలయాఘాట రోమాటవీ సముత్పాటన
పరిపాటికై పాటలగంధులు దీనిం బాటింతు

రనుచు నాలింగించి యట పోవంబోవ ముందట
వెలిపాళెంబు మధ్యప్రదేశంబున హోలికవాటి
యందు నొక్కచక్కని జవరాలు కట్టెఱ్ఱతోఁగ
రుంగట్టుల యొల్లియయొఱ్ఱ గలనితంబభారంబున
నమర్చి బాలార్కకిరణసంపర్కంబునఁ జాంపేయ
కుసుమచ్ఛదచ్ఛాయాదాయాదంబు లైనయవ
యవంబులు మిసమిస మెఱవం గుక్కుటాసనం
బునం గూర్చుండి.

పామరభామ

౮౨ ఉ. కందుకకేళి సల్పెదుప్ర
 కారమునం బురుషాయితక్రియా
తాండవరేఖ చూపెదువి
 ధంబునఁ బామరభామ చేఁతయీ
రెండప్రభాతవేళ రచి
 యించె నితంబభరంబుఁ జన్నులున్
గుండలముల్ గురుల్కదల
 గోమయపిండము లింటిముంగిటన్.

౮౩ వ. అప్పామరభామారత్నంబు నుద్దేశించి.

౮౪ గీ. పొలపములు లేవు కరివంకబొమలయందు
జిన్నినగవులు లేవు లేఁజెక్కులందుఁ
గలికితనములు లేవు క్రాల్గన్నులందుఁ
గాఁపుటిల్లాండ్ర కిట్టిమౌగ్ధ్యముల యొప్పు.

వ. అటచని వీథీవిటంకంబునఁ డిట్టిభుండు విటపేటికా
85 ప్రకామ(ర?)ఘటిత కృతాటికానికట చేటికా
నుయాత యగుకర్ణాటాంగనం గనుంగొని.

కర్ణాటాంగన

మ. కుసుమం బెట్టినచీరకొంగు వొలయం
86 గ్రొవ్వారుపాలిండ్లపైఁ
ద్రిసరంబుల్ పొలుపార వేణి యవటూ
ద్దేశంబుతో రాయ న
ప్పస మెవ్వాఁడో యొకండు రాత్రి సురత
ప్రౌఢిం దనుం దేల్చెనా
వసివాళ్ వాడుచు వచ్చుచున్నయది క
ర్ణాటాంగనం జూచితే.

82 గీ. వాహకుం డెక్కి విడిచినవారువంపుఁ
గొదమయునుబోలి రతికేళిమదము డిగ్గి
యలసభావంబుతోడఁ గర్ణాటవేశ్య
వచ్చుచున్నది యదె విప్రవర్య కంటె.

ఉ. ఈమరి యింక నొక్కమరి
88 యింకొకమా ఱింక నొక్కమాఱు నా
నోములపంటగా యనుచు
నోవులఁ బెట్టుచు(?) శే యొకండునా

ల్జాములు దీనితోఁ గుసుమ
సాయకతంత్రము సల్పఁబోలు లే
దా మృగశాబనేత్ర యఖి
లాంగకముల్ పసివాళ్ళు వాడునే ?

౮౯ వ. అనిన మందస్మితంబుతో గోవిందమంచనశర్మ నర్మగర్భంబుగా దర్భాంకురాలంకృతంబు లగు తనకరపంకజంబులం గర్ణ పుటంబులు ముట్టుకొని పూతిమాషగోత్రంబును మంచననామధేయంబునుం జెప్పి నమస్కరించి యిట్లనియె.

౯౦ శా. పంచారించిన నీ పయోధరము లా
స్ఫాలింతునో; లేఁతబా
మ్మంచుఁ గెంజిగురాకుమోవి ణిసిథా
త్వర్థం బనుష్ఠింతునో;
పంచాస్త్రోపనిషద్రహస్యపరమ
బ్రహ్మస్వరూపంబు నీ
కాంచీదామపదంబు ముట్టుదునో; యో
కర్ణాటతాటంకినీ!.

౯౧ క. వ్రాలని నీ చన్నులతో
వ్రాలెడుజక్కవలు సరియె? వలలం బెట్టం

జాలెడునీకన్నులతో
బాలకి సదృశములె? వలలఁ బడుమత్స్యంబుల్.

92 శా. చాటుప్రౌఢిఁ బిసాళి మాడెదవు కా
సల్నాటిబాఁపండవో
శాటీహాటకనిష్కముల్ వెలిగ జం
ఝాటంబు చాలించు క
ర్ణాటస్త్రీలు కటారికత్తియలచే
రాపాడఁగాఁ బట్టఁగాఁ
డా టా లీడ గుణింపరాదు పెటుచో
టం బోలెఁ బైపాటునన్.

93 గీ. దిట్టబాఁపండు నడువీథిఁ దెగడి పలికెఁ
గూట మీటింపఁ దెమ్ము కిరాట నేఁడు
పన్నిదము వీనిమెడ నున్నజన్నిదములు
సవరగా గ్రుత్తుఁ గ్రొత్తపుంజాలదండ.

94 వ. అనుటయు విప్రుం డిట్లనియె.

95 సీ. మునుఁగు వెట్టిన నేమి ముత్యాలకమ్మల
క్రొమ్మించులీలలు గుబులుకరించె
హోము వంచిన నేమి మొలకనవ్వులకాంతి
చెక్కుటద్దములపైఁ జీరువాఱెఁ
జూడకుండిన నేమి సొబగుఱెప్పల మించి
తేటవాల్మెఱుఁగులు దిచ్చరించెఁ

జాటు చేసిన నేమి చక్రవాకులఁ బోలు
పాలిండ్ల మెఱుఁగులు బయలుపడియె
సిగ్గు నటియించి మా వేడ్క చిన్నఁబుచ్చి
యేల యిటు పిసాళించె దిం దేమి సిద్ధి
కాముసామ్రాజ్యపట్టంబు గట్టి నన్ను
గాఁగిలింపఁగఁగదనె యోకరణకాంత.

౯౬ వ. అని చిఱునవ్వు నవ్వుచు గోవిందమంచనశర్మ నర్మసఖుండును దానును నటపోవఁబోవ ముందట.

జూదము

౯౭ మ. పరివేష్టించి ప్రజాకదంబకము పై
పై వ్రాలి వీక్షింపఁగాఁ
బరహస్తంబున నొత్తుకాండ్రు నపలా
పప్రౌఢి బోధింపఁ బా
మరులై పన్నిద మాడి యోడి మఱి దు
ర్మానంబుతో నాటఁగో
ల్పిరి వేశ్యావలయాభిసంవళిత ము
ద్విభ్యార్చి గోవిందునిన్.

౯౮ శా. సంగాసంగజయాజయంబు పరిహా
సప్రస్ఫుటాక్షీలభా

షాంగం బాకలితాంతరావలయుక
త్స్యాభాగముద్రాలస
ద్భంగీనిష్ఠితకాష్ఠశంఖుకము పా
పద్మ్యాత మీాపన్నిడం
బంగీకారము సేయువారి మొలలం
బ్రాపించుఁ గౌపీనముల్.

99 గీ. నీకు నా నీకు నా నంచు నెమకి నెమకి
ముగుద లగువారి భ్రమియించి మోసపుచ్చుఁ
బశ్యతోహరుఁ డత్యంతపాపబుద్ధి
పట్టణములోఁ దగుల్పరిపం దెగాఁడు.

100 వ. అనుచు నట ముందట శతానందగేహినీకరరుహ
ప్రరోహశిఖర ముఖరవీణాక్వాణ పాణింధమం
బైనమధురస్వరంబున.

కరణకాంత

101 సీ. విజ్ఞోడు పడ నిడ్డ వెండ్రుకజందెంబు
వలిగుబ్బపాలిండ్ల కెలఁకు లొరయఁ
గరమూలమున వెండిమొరవంకకడియంబు
మూఁడుమూలలలింగముద్ర లొత్త
జంగాళముగఁ బింజె సవరించి కట్టిన
మడుఁ గొంటిపొరను లోఁదొడలు మెఱయ

బలితంపువిచ్చుటాకులదుద్దుఁగమ్మలు
నిద్దంపుఁజెక్కులనీడఁ జూడ
నోరుఁగంటిపురంబులో నోరగ్రంతఁ
బెద్దయెలుఁగున నమ్మొ సంపెంగనూనె
కోకిలము పంచమశ్రుతిఁ గొసరినట్లు
కనుమయవ్వలి దేశంబు కరణకాంత.

101 గీ. పలికినప్పుడు తేనియ లొలికిపడెడు
జళుకుఁజూపులఁ గ్రొమ్మించు లులుకుపడెడు
ములికినాటిది కాఁబోలుఁ జెలి కిరాట
కలికి చిలుకలకొలికి యీ తెలికిజోటి.

గానులకన్నె

102 ఉ. ఈనళినాక్షి దాఁ దిరుపు
పెద్ద ప్రతోదము మోపి రొప్పుచుఁ
గానుగపట్టెపైఁ దిరుగఁ
గట్టెఁడి టిట్టిభ! మందరాద్రిమం
థానకమధ్యమానతిమి
ధామజలభ్రమిమండలం బధి
ష్ఠానముగా భ్రమించునల
సంపదచేడియఁ బోలకుండునే.

103 ఉ. మీనవిలోచనంబులును
మీఁటిన ఖం గనుగుబ్బచన్ను లిం

పైనవచోమృతంబు సొఁగ
సైనమదాలసమందయానముం
గా నొనరించి దీని గణి
కామణిఁ జేయక నిర్దయాత్ముఁడై
గానులదానిఁ జేసినవి
కారవిధిం దలమొత్తఁగాఁ దగున్.

వ. అట యుత్తరంబునం గత్తెరనొత్తి పెక్కువన్నెల పొత్తుల బహువిధ వర్తనల హత్తించి యొత్తి కట్టిన పూగొత్తులు మత్తకోకిల కలహంస దాత్యూహ వ్యూహంబులుం గలిగిన మోహరివాడ యందు.

కుట్రపువాఁడు

చ. కొలుచును జేనవెట్టి కుచ
కుంభయుగం బెగడిగ్గఁ గన్నుఁగ్రే
వలఁ బరికించుఁ గతుముల
నైచును దృష్టులు మాటిమాటికిం
గలికితనంబునం దఱచు
గా నగు సొచికపల్లవుండు గం
చెల వెసఁ గుట్టియీఁడు వెల
చేడియకున్ విషయాభిలాషియై.

106 వ. అనుచు నవ్వాడ గడచి యట యుత్తరంబు సను
నప్పుడు ముందట నొక యింటిముఱుంగున
మచ్చెకంటిం బొడగని.

ఈకిర్చుట

107 ఉ. సారెకు సారె కేమిటికిఁ
జంపెదు గోరఁటుమొగ్గలైనవా
లారునఖాంకురంబుల వ
యస్యకచంబునఁ బొటపొట యీ
రీరిచి సీత్కృతుల్ చెవుల
కిం పొనరింపఁ జకోరనేత్ర! నీ
చారుకుచద్వయంబు మముఁ
జంపెడుదోసము నీకుఁ జాలదే ?

108 వ. అనుచు నయ్యింటిముందట;

పసుపు నూఱుట

స్ర. పరిపాటీఖర్వఖర్జూపరతిసమయసం
భ్రాంతసంభోగభంగిన్
దరుణీరత్నంబు హేలాతరళగతి హరి
ద్రారజఃకర్దమంబుం
గురు లల్లాడంగ పీఁగుంగుచములు గదలం
గొంతు గూర్చుండి నూరెన్

గరవల్లీ కాచభూషాకలమధురఘుణా
త్కారములోఁ తోరములోఁ గాఁక.

109 వ. అని యచ్చోటు వాసి బాహ్యకటకవీథీవిటం
కంబు లతిక్రమించి.

ఓరుఁగల్లు

110 సీ. సప్తపాతాళవిష్టపమహాప్రస్థాన
ఘంటాపథం బైనగనపపరిఖ
తారకామండలస్తబకావతంస మై
కనుచూపు గొనని ప్రాకారరేఖ
పుంజీభవించినభువనగోళముభంగి
సంకులాంగణ మైనవంకదార
మెఱుఁగుఱెక్కలతోడి మేరుశైలముఁ బోలు
పెనుపైఁడితలుపులపెద్దగవని
చూచెఁ, జేరెఁ, బ్రవేశించెఁ, జొచ్చెఁ, బ్రీతి
సఖుఁడుఁ దానును రథఘోటశకటకరటి
యూథసంబాధముల కొయ్య నోసరిలుచు
మందగతి నోరుఁగల్లు గోవిందశర్మ.

111 వ. ప్రవేశించి టిట్టిభనామధేయుం డైనకోమటి
సెట్టిగారితో నాతఁ డిట్లనియె.

12 సీ. రాజమార్గంబు వారణఘటాఘోటక
శకటికాభటకోటిసంకులంబు
ధరణీస్థలీరజస్త్రసరేణుబహుళంబు
గావున మన మందుఁ బోవవలదు
క్రంతత్రోవల నొంచుగలకలంబులు లేవు
తఱచుగా సుఖవినోదములు గలవు
మఱియు విశేషించి మన్మథకూట మా
వేశవాటిక మధ్యవీథిఁ దఱిసి
చిత్తమున కెక్కినట్టిలంజియలతోడ
సరససల్లాపసౌఖ్యంబు సలుపవచ్చు
నంత మధ్యాహ్నసమయ మానవుడు గాని
వేడుకై యుండ దక్కలవాడ సొరఁగ.

13 గీ. అనినఁ డిట్టిభుఁ డౌ నంచు ననుచరింప
నాలువరిక్రిందిత్రోవగా నరిగి యరిగి
విప్రుఁ డీక్షించెఁ బలినాటివీరపురుష
పరమదైవతశివలింగభవనవాటి.

పల్నాటివీరులకథ

14 మ. ద్రుతతాళంబున వీరగుంభితకథం
ధుంధుంకిటాత్కారసం

గతి వాయింపుచు నాంతరాళికయతి
గ్రామాభిరామంబుగా
యతి గూడం ద్విపదప్రబంధమున వీ
రానీకముం బాడె నా
కృత ప్రత్యక్షరముం గుమారకులు ఛీ
ట్కారంబునం దూలఁగన్.

సీ. గర్జించి యురసి జంఘాకాండయుగళంబు 115
వీరసంబెట కోల వ్రేయు నొకఁడు
ఆలీఢపాదవిన్యాస మొప్పఁగ వ్రాలి
కుంతాభినయముఁ గైకొను నొకండు
బిగువుఁగన్నుల నుబ్బుబెదరుఁజూపులతోడ
ఛీట్కార మొనరించుఁ బెలుచ నొకఁడు
పటుభుజావష్టంభపరిపాటి ఘటియిల్ల
ధరణి యాస్ఫోటించి దాఁటు నొకఁడు
ఉద్ది ప్రకటింప నొక్కరుం డోల వాఁడు
బయలు గుజ్జంబు భంజళ్లఁ బఱపు నొకఁడు
కోడుము దాటింపుచును బెద్దగోలువులోనఁ
బడఁతి పల్నాటివీరులఁ బాడునపుడు.

గీ. కులముదైవతంబు గురిజాలగంగాంబ 116
కలనిపోతులయ్య చెలిమికాఁడు

పిఱికికండ లేనియఱువదియేగురు
పల్లెనాటివీర బాంధవులకు.

117 గీ. అరువల్లినాయి * నారిదుర్మంత్రంబు,
కోడిపోరు, చాపకూటికుడుపు
ప్రథమ కారణములు పల్నాటియేకాంగ
వీరపురుషసంప్రహారమునకు.

118 ఉ. పచ్చనిపిండిగందమును
బాలముసేసయు సెజ్జపూవులన్
గ్రుచ్చినకంఠమాల్యములు
గొప్పగ నల్లిన వేణిబంధముల్
తుచ్చులవీరసంబెటయుఁ
గ్రొత్తమణుంగగుకాసెపుట్టముల్
అచ్చల కెక్కినట్టిరవ
ణంబులు వీరకుమారకోటికిన్.

119 క. నల్లంగొండయు నాగరి
కల్లును ధరణీస్థలిం బ్రగల్భస్థలముల్
పల్లెలు నాగులేటును
బల్లెఱ్ఱకాంత యెల్లప్రారంభంబుల్.

* యురాలి అని యుండవచ్చును.

సీ. ఇచ్చోట భుజియించి రేకకార్యస్థులై
సామంతనృపతులు చాపకూడు
ఇచ్చోటఁ జింతించె నిచ్చ నుపాయంబు
నళినాక్షి యార్వెల్లి నాయురాలు
నిజ మనశ్శుద్ధికై నిప్పులయేటిలో
నోలాడె నిచ్చోట బీలసాని
ఇచ్చోటఁ బోరిరి యిల పణంబుగ గొల్ల
సవతితల్లులబిడ్డ లవనిపతులు
ధీరు లగువార లేవురు వీరపురుషు
లై మహోద్ధతి నిచ్చోట నాజిఁ బడిరి
యనుచుఁ జెప్పుదు రైతిహ్య మచట నచట
జనపపెద్దలు పల్లెదేశములయందు.

ఉ. చిత్తము గూర్చి మాచెరల
చెన్నుఁడు శ్రీగిరిలింగముం గృపా
యుత్తతఁ జూడ *ముల్కి విష
యంబున కామహిమంబు చెల్లెఁగా
కుత్తరలోన మింట జల
ముట్టినమాత్రన నాపజాలలో

* "ఁబల్లె" అని యుండునేమో?

విత్తినయౌవనాళ మభి
వృద్ధి ఫలించుట యెట్లు చెప్పుమా

122 మ. మగసింగంబులు సంగరాంగణముల౯
మత్తిల్లి రున్మత్తులై
జగదేకస్తుతు లంచు నేమిటికి సం
శ్లాఘింప! నాభూమిలోఁ
జిగురుంబోఁడులఁ గాఁపుగుబ్బెతల న
క్షీణప్రభావంబున౯
మగసింగంబులఁగా నెఱుంగుదురు పుం
భావప్రసంగంబుల౯.

123 గీ. కోలదాపునఁ ద్రిక్కుటిఁ గూడియున్న
గచ్చుసేసినచిత్రంపుగద్దెపలక
వ్రాసినా రదె చూడగా వైశ్యరాజ!
శీల బ్రహ్మాదివీరనాసీరచరిత.

124 వ. ఈ వీరపురుషులు మనకుం గార్యసిద్ధి సేయుదురు గాక పదపద మనుచుం గతిపయపదంబు లరిగి నింబపల్లవ నికురుంబ సందానిత వందనమాలికాలంకృత ద్వారం బగు నేకవీరాగార గోష్ఠంబు గనుంగొని.

## ఏకవీర

సీ. వందనం బిందిరావరుకన్నతల్లికి
125 దండంబు ఫణిరాజమండనకును
నంజలి సోమసూర్యానలనేత్రకు
నభివందనము జగదంబికకును
మొగుపుఁజేతులు దేవమునిసిద్ధసేవ్యకు
జమదగ్ని గారాపుసతికి శరణు
జోహారు రమణీయశోభనాకారకు
నమితంబు గిరిరాజనందనకును
నిత్యకల్యాణి కలికులనీలవేణి
కాదిశక్తికి వేదవేదాంతసార
కేకవీరకుఁ బూర్ణరాకేందుముఖికి
నఖిలజననికి సాష్టాంగ మనుదినంబు.

సీ. పద్మలోచన భృగుబ్రహ్మసంయమివంశ
6 పరిపాటి కభినవాభరణ మయ్యె
రమణి త్రేతాద్వాపరములసంధ్యావేళ
మగనితోఁ బెక్కేండ్లు మనువు మనియె
నెలఁత కానకకన్న నెయ్యంపుఁగొడుకుచేఁ
జంపించె ముయ్యేడుసారె నరులఁ
దరుణి హైహయరాజదంతాస్థిపటలంబు
గవడపేరుగఁ జేసి కట్టె నతుల

మండపాకను, బెనుఁబాక, మాహురమున,
నాగవరమునఁ, బోలాస ననిచె నింతి
యోరుఁగంట వసించె నీలోత్పలాక్షి
*కాకతమ్మకు సైదోడ యేకవీర.

127 సీ. అలిగి యెంతటిరాజునాంధ్ర నైనను బట్టి
పుట్టుఁబాపలఁ జేయురట్టుకత్తె
ఘనుఁ డైనజమదగ్నిమునినాథుకూరిమి
వెలయించుపెనుఁబాక వేడ్కకత్తె
సుక్షత్రియకులంబు నిక్షత్రముగఁ జేయు
కొడుకుఁ గాంచినయట్టికోపకత్తె
బవనీలజవనికపాటల నిల్లాంధ్ర
రమణఁ బ్రదుల్లాడించురంతుకత్తె
యోలిమి గదుళ్ల వాఁగులో నోలలాడు
కలికిపల్లికదేబెలఁ గన్నతల్లి
వాసి కెక్కినయట్టిపోలాసయిల్లు
చక్కమెప్పులమాహుర మ్మక్కనాచి.

బవనీఁడు

128 సీ. కక్షునిక్షిప్తవికస్వరస్వరవిలా
సశ్రీనివాసంబు జవని కందుఁ

* అనుబంధముఁ జూచునది.

గట్టినతంత్రికిఁ గంఠశ్రుతికిఁ గూడఁ
జోక్యంబుగా నారి సొబగు మీఱ
నాలాపముల శుద్ధసాళవ సంకీర్ణ
వివిధరాగంబులచవులు చూపి
డమడమధ్వనులఁ బొటారించి యెడనెడఁ
గత్తెరమార్గంబు బిత్తరిల్ల
వాద్యవైఖరిఁ గడు నెఱవాది యనఁగ
నేకవీరామహాదేవియెదుట నిల్చి
పరశురామునికథ తెల్లఁ బ్రౌఢిఁ బాడెఁ
జారుతరకీర్తి బవనీలచక్రవర్తి.

మాలెత

మ. అలరుంబోఁడి జనంగమప్రమద మ
129 ధ్యానద్ధఘంటాధ్వనుల్
చెలఁగం బాడె సమస్తలోకజననిన్
శ్రీయేకవీరాంబికన్
వలరా జొక్కకమూర్ఛనాస్వరమునన్
బ్రాణంబు గల్పింపఁగాఁ
గలకంఠీకలకంఠకోమలకుహూ
కారంబు తోరంబుగన్.

మ. అకలంకస్థితిఁ గోరి కొల్చెదరు బ్ర
130 హ్మానందభావంబునన్

సకలానందమయైకమాత్ర లగుచుం
సంతోషచిత్తంబునన్
తకదుమ్ముల్ యకతాళముల్ జవనికల్
తందాన లమ్మయ్యకున్
ఏకవీరమ్మకు మాహురమ్మకు నథో
హ్రీంకారమధ్యాత్మకున్.

13 శా. ఆలోకింపక మ్రొక్కరాదు నిజభ
క్త్యావేశసంపత్తిమై
నాలోకించినఁ జిత్త మెట్లగునో కా
మావేశసంయుక్తిమై
నేలా గోయి కిరాట! మానుదమొ సం
వీక్షింతమో చెప్పుమా?
శ్రీశాశూన్యకటీరమండలము దే
వీశంభళీవ్రాతముల్.

కాఁపుటాలు

152 సీ. జటివోనిగడితంపుఁ జెఱుతచౌకంబుల
తోఁగరుఁబుట్టము కచ్చఁ దోడివి కట్టి
యోలగందపుబొట్టు నుపరిభాగంబుపై
సిందూరతిలకంబుఁ బొందుపఱచి

పసరుదాఱెడునింబపల్లవంబులదండ
గుబ్బచన్నులమీఁదఁ గుదురుకొల్పి
క్రొత్త దోమినదంతకోరకంబులయందుఁ
దాంబూలరాగంబు తళుకు గూర్చి
సకలసంధ్యంగములకుఁ దేజంబు గలుగ
మధుమదారంభ మెఱుఁగువ మరలఁ ద్రోవఁ
దేఁకువయు నారజంబునుఁ దేటపడఁగఁ
బురమునకు వచ్చె నొకకాఁపుఁబూవుబోఁడి.

వ. అయ్యవసరంబున నేకవీరాంబకుం బ్రణమిల్లి
133 యాట చనునప్పుడు.

జక్కులపురంధ్రి

సీ. కోణాగ్రసంఘర్ష ఘుమఘుమధ్వని తార
134 కంఠస్వరంబుతో గారవింప
మసిబొట్టుబోనాన నసలుకొల్పినకన్ను
కొడుపుచేఁ దాటించు నెడపడడప
శ్రుతికి నుత్కర్షంబుఁ జూపంగ వలయుచోఁ
జెవిత్రాడు బిగియించు జీవగఱ్ఱ
గిల్కుగిల్కున మ్రోయుకింకిణీగుచ్ఛంబు
తాళమానంబుతో మేళవింప

రాగముననుండి లంఘించు రాగమునకు
నురుమ యూరుద్వయంబుపై నొత్తిగిల్లి
కామవల్లీమహాలక్ష్మి కైటభారి
వలపు వాడుచు వచ్చె జక్కులపురంధ్రి.

అక్కలు

135 సీ. ముద్రికామాణిక్యములదీప్తి కెంగేలి
పించెంబుఁగుంచెతో బిత్తరింప
నుపవాసమునఁ దద్దయును సన్న నగుకౌను
చనుదోయిభరమున జలదరింపఁ
దోకచుక్కలఁ బోలుతోరంపుఁదెలికన్ను
లాస్యవేళమున సిగ్గు నతకరింప
నిద్దంపు వెలిపట్టు నెఱిక దూలినయప్పు
తోడలమించులు వెలిఁ దొంగలింప
నురుమచప్పుళ్లకును బిల్లదురులమ్రోఁత
కంతకంతకుఁ బేరుబ్బు నావహింప
నాడెఁ బీఁటలపై నోలిఁ గూడియున్న
యక్కలేడ్వురలో నొక్కయలరుఁబోఁడి.

136 చ. హరహర యింత యొప్పునె మ
హారభటిం జగఝంకృతస్వన

న్మురళీవిమిశ్రితాంకరవ
మూర్ఛలఁ జిత్తము లుబ్బ యక్కటే
డుబ్బరు నదె యాడఁజొచ్చిరి క
డుంగడు వేడ్క సమున్నమత్పయో
ధరయుగభారభీరుతమ
తన్వవలగ్నము లైననృత్యముల్.

వ. ఇదె యీయింటి యజమానుండు సంతానకాం
107 క్షియై ప్రతిబంధనోదనార్థంబు యక్షకన్యలం
బరీక్షారాధనంబు సేయుచున్నవాఁడు గావలయు
మాణిభద్రకులోద్వహు లైన దేవతలు కామవల్లి
శ్రీమహాలక్ష్మితోఁ గూడి యపేక్షితకార్యంబు
మనకునవ్యాక్షేపంబునం జేయుదురుగాక యనుచు
విశ్వాసంబుతో నమస్కారంబు సేసి కౌసల్నాటి
గోవిందమంచనశర్మ నర్మసఖుండు దాను నట చని
ముందట.

గీ. మంద్రమధ్యతార మానత్రయాభిన్న
108 మహిషశృంగనాదలహరిఁ గూడి
డమరు డిండిమంబు డమడమధ్వని మ్రోసె
నద్భుతం బదేమి యార్భటంబు.

మైలారభటులు

139 వ. అని టిట్టిభుం డడిగిన

140 సీ. అవఅవ మండు నెఱ్ఱనిచంద్రముల్లెల
చోద్యంపుగుండాలు చొచ్చువారు
కరవాఁడియలుఁగుల గనపపాఁతర్లలో
నుట్టిచేరులు గోసి యుఱుకువారు
గాలంపుఁగొంకిఁ గంకాళచర్మము గ్రుచ్చి
యుడువీథి నుయ్యేల లూఁగువారు
కటికిహొన్నాళంబు గండగత్తెర వట్టి
మిసిమింతులును గాక మ్రింగువారు
సందులను నారసంబులు సలుపువారు
యెడమకుడిచేత నారతు లిచ్చువారు
సాహసము మూర్తిగైకొన్నసరణివారు
ధీరహృదయులు మైలారవీరభటులు.

141 గీ. వీరు మైలారదేవరవీరభటులు
గొండ్లి యాడించుచున్నారు గొరగపడుచు
నాడుచున్నది చూడు మూర్ధాభినయము
తాను నెట్టికసీలంత గాని లేదు.

142 చ. వెనుకకు మొగ్గ వ్రాలి కడు
విన్నను వొప్పఁగఁ దొట్టెనీళ్ళలో



మైలారదేవాలయ ద్వారము



మైలారదేవాలయ మండపము

మునిఁగి తదంతరస్థ మగు
ముంగర ముక్కున గ్రుచ్చికొంచు తే
చెను రసనాగ్రప్రవాళమున
శీఘ్రము గ్రుచ్చెను నల్లపూస పే
రనుపమలీల నిప్పుడు చు
పాయము లిట్టివి యెట్లు నేర్చెనో?

143 సీ. శనివారసిద్ధి సజ్జనపారిజాతంబు
వరదాత యాదిత్యవారభోగి
మాడచీరమడుంగు మాయావినోదుండు
మాళవీప్రియభర్త మహితయశుఁడు
పల్లెంబనాయకుం డెల్ల వేల్పులరాజు
గనపవేఁటలవేడ్క కాంద్రభర్త
కత్రశాలస్వామి కరుణాపయోరాశి
పుణ్యకీర్తనుఁ * డైనప్రోలియయ్య
మంచు కుంచాలఁ గొలువంగ మాయతెల్లఁ
బట్టికట్టంగ నేర్చినబాసవెల్లి
భైరవునితోడిజోడు మైలారదేవుఁ
డోరుఁగంటినివాసి మే లొసఁగుఁ గాత.

144 మ. అదిగో! యెత్తినవారు పట్టణము మ
ధ్యక్షోణి సింహధ్వజం

* 'అయిన ప్రోలి' లో మైలారదేవుని విగ్రహము కలదు. దాని ప్రతిబింబమును శ్రీ గజపతిరాయవర్మగారు సంపాదించిరి.

బడిగో! కట్టినవారు నింబదళమా
ల్యాతోరణవ్రాతముల్
విదితం బయ్యె మహోత్సవంబు నెఱయన్
వీథీవిటంకంబులం
దదిగో! నిల్పినవారు పూర్ణకలశం
బాబాలవృద్ధాంగనల్.

145 మ. అకలంకస్థితి శీధుపానరుచులై
యాసాదు లుప్పొంగి యో
యకరో యమ్మకరో యమక్కరొ యదీ
యట్టట్టకో యంచుఁ బా
యక తప్పెట్లనుఁ దక్కితాళములు నిం
పై సొంపు రంజిల్లఁగాఁ
జకజుంజుం జకజుంజు జుమ్ము మనుచున్
సాగుం గడున్ వాద్యముల్.

146 వ. అట చని ముందట.

నగరావలోకనము

147 సీ. అదె భైరవస్థాన మటమీఁద నల్లదె
చముడేశ్వరీమహాశక్తినగరు
వీరభద్రేశ్వరాగారమంటప మదె
యదె బౌద్ధదేవువిహారభూమి

అదె ముద్దరా ల్మసానమ్మనివాసంబు
నల్లదె కొమరసామయ్యనగరు
అదె పాండవులగుడి యట దక్షిణంబునఁ
గర్తారుఁ డుండుతుర్కలమసీదు
కొంతదవ్వుల నదె మహాగోపురముల
పైఁడికుండలు రవిదీప్తిఁ బ్రజ్వలించి
కానవయ్యెను మేరుశృంగములఁబోలెఁ
గేశవశ్రీస్వయంభూనికేతనములు.

148 వ. అనుచు నట చని ముందట నొక్క భైరవాలయంబుఁ బొడగని నమస్కరించి కాసల్నాటి మంచనశర్మ యిట్లనియె.

భైరవుఁడు

149 మ. అమితోత్సాహముతోడ నీవు పటుబా
హాథక్క నొక్కొక్కమా
టు మనఃకంపము నొందఁ జేయఁ దొలఁకా
డుక్ వార్ధి వేలాలుఠ
త్కమఠంబై, వలమానమీనమయి, యు
ద్యన్నక్రమై, యుత్తర
త్తిమియై, యుల్లలదంబుమగ్నధుళియై
ధీరా మహాభైరవా!

150 వ. అని యూర్ధ్వం బవలోకించి యిప్పుడు మధ్యా
హ్నకాలం బగుచున్నయది.

మధ్యాహ్నము

151 శా. ప్రాలెన్ దిక్కుల భానుభావ్యతికర
ప్రక్రీడదర్కోపల
జ్వాలాజాల జటాలజాంగలతటీ
వాచాలకోయష్టికై
రోలంబంబులు మూతి ముట్ట వెఱచెన్
గ్రొవ్వేఁడి బీరెండలన్
జాలం గ్రాఁగి కరంబు వేఁడి యగుకా
సారాబ్జమైరేయముల్.

152 వ. అని యనంతరం బాకాశంబునం జెవివెట్టి శ్రుతి
నభినయించి గోవిందుండు.

గడియారము

153 మ. ఉడువీథిన్ శిఖరావలంబి యగునం
భ్రోర్వీశు మోసాలపై
గడియారంబున వ్రేసె రెండెనిముదుల్
ఘంటాఘణాత్కారముల్
సడలెన్ భానుఁడు పశ్చిమంబునకు నై
శ్వా! పూఁటకూటింటికిన్

గుడువం బోదమె లెక్కయిచ్చి? కడు నాఁ
కొన్నార మిప్పట్టునన్.

154 వ. విచారించిన నదియును మనకు విశ్రమస్థానంబు.

పూఁటకూటియిల్లు

155 గీ. సంధివిగ్రహయానాదిసంఘటనల
బంధకీజారులకు రాయబారి యగుచుఁ
బట్టణంబున నిత్యంబు పగలు రేయి
పూఁటకూటింట వర్తించుఁ బుష్పశరుఁడు.

156 వ. అనుచుఁ గొంతదవ్వరిగినం దమకు నెదురుగా
నేతెంచు నొక్క బ్రాహ్మణుం గనుంగొని.

157 ఉ. వీఁడిదె తెల్లనాకులను
వీడెము సేయుచు వీథి వచ్చుచు
న్నాఁడు మదించి తిండి తిని
నాఁకు చుమీ యిటమీఁద నేడకో
పోఁడఁగఁ బోయెడిం గరణ
దేశపుజాణఁడు గాఁగఁ బోలు నీ
బాఁడు పణోపహారపరి
పాటి యెఱుంగగవచ్చు వీనిచేఁ.

158 వ. ఇతఁడు వెడలివచ్చు నవ్వాడయె పూఁటవంట
కంబు వెట్టు బాడబులవాడ గావలయు నది
యెట్లంటేని.

159 ఉ. ఘ్రాణపుటీకుటీరములఁ
గాపుర ముండఁ దొడంగె నిప్డు పా
షాణఘరట్టఘట్టనవ
శంబునఁ బుట్టినసత్తుగంధ మ
క్షీణకఠోరసౌరభవి
జృంభణ దిక్కులఁ జల్లఁ జొచ్చె సా
మ్రాణిపదార్థజాలములు
బ్రాహ్మణకాంతలు తాలఁ బోయఁగన్.

160 గీ. మందవేగంబుతోఁ గ్రొత్తమలఁకవాళ్ల
కిఱ్ఱుచెప్పులు మొరయ నుంకించి నడుచు
కరణబ్రాహ్మణవిటముఖ్యుఁ గదియ వచ్చి
పూతిమాషాన్వయుం డగుభూసురుండు.

161 వ. పూఁటవంటకంబుల వృత్తాంతం బడిగిన నతండు.

162 క. ఆహారవిహారములకో
యాహారంబునకునో విహారంబునకో
బేహారము మీ కీసం
దేహారంభంబు మాకుఁ దెలియఁగ వలయున్.

163 వ. ఆహారంబున కంటేని

164 ఉ. కప్పురభోగివంటకము
కమ్మనిగోధుమపిండివంటయున్

గుప్పెఁడుపంచదారయును
క్రొత్తగఁ గాఁచినయాలనే పెస
ర్పప్పును గొమ్మునల్లనఁటి
పండ్లును నాలుగు నైదు నంజులున్
లప్పలతోడఁ గ్రొంబెరుగు
లక్ష్మణవజ్ఝలయింట రూకకున్.

165 వ. విహారంబున కంటేని దద్గృహంబున.

166 క. అఱుగాను గుబ్బచన్నులు
మెఱుఁగుంగన్నులును గలుగుమెచ్చులనవలా
కుఱుబోడ ముండరత్నము
బఱివోవఁగ విడిచినట్టిబ్రహ్మకు జేజే.

167 శా. పూవుంబోఁడులు లేరె విప్రవిధవల్
భూమండలిన్ దానిరే
ఖావైదగ్ధ్యవిలాసవిభ్రమకళా
గర్వంబు లట్లుండనీ
యావిశ్వస్థ యుపస్థచాయ నవల
క్షాధీశఫాలస్థలీ
సౌవర్ణస్థిరపట్టబంధసుషమా
సౌభాగ్యలక్ష్మిన్ గనున్.

168 ఉ. కోయిల పంచమస్వరము
క్రోల్చినభంగిని విద్దెకంచి రా

మాయణ మాఱుకాండములు
నచ్యుతజాగరవేళఁ బాడె నా
రాయవితంతురత్న మను
రాగముతోడ "నమశ్శివాయ శాం
తాయ సమస్తదోషహర
ణాయ" సమానమె దాని కెవ్వరుఁ?

169 ఉ. సంకృతిపూతిమాషకుల
సాగరశారదపూర్ణిమాకరం
గాంకుఁడు మంచి లక్ష్మణుగ్ర
హాంబున నెచ్చెలి కాఁడుఁ దానునుం
జంకలబంటిగా మెసవి
చక్కని వేడుకకత్తెఁ జూచి తా
రింకొకమాటు వత్తమని
యేఁగిరి కార్యభరంబు మెప్పుసన్

170 వ. అట వోవంబోవ ముందట.

గేదఁగిపూవు

171 సీ. పాంథసీమంతినీ ప్రాణమత్స్యములకు
గాలాము లగుకంటకములతోడ
గరుడపచ్చలచాయఁ బరిహాసింపఁగఁ జాలు
దళమైనబాహ్యపత్రములతోడ

జీర్ణకీకసకణశ్రేణిఁ జిడ్డలు చేసి
యవియఁ దోమినయట్టియన్నుతోడఁ
బదియాఱువన్నియబంగారు సరివచ్చు
సంవర్తికాపలాశములతోడ
శివునిచిచ్చుఱకంట వెచ్చినయనంగు
బూది కెనయైనకమ్మఁబుప్పొళ్లతోడ
దావి ఘనమైనకమ్మ గేదంగిపూవు
భూసురున కిచ్చెఁ దగ నొక్కపుష్పలావి.

172 వ. ఇచ్చినం జూచి

173 ఉ. క్రొన్నెలరేఖతోడఁ గెడఁ
గూడి సుఖింపఁగ భాగ్య మబ్బమిన్
ఖిన్నత నొందుఁ గాని నవ
కేతకి శూలి వివేకహీనుఁడై
తన్నుఁ దిరస్కరించుటకు
దైన్యము నొంద దదే వివేకసం
పన్నిధి దానిపాలి పెరు
మాళ్ళొకఁ డెక్కడనైన లేఁడొకో?*

174 సీ. అందుకొని పుష్పలావికిఁ ద్యాగ మిచ్చి
బ్రాహ్మణుల కందు నొక్కొక్కపత్ర మొసఁగి
జాణవిప్రుండు సిగఁ దాల్చెఁ జందమామ
కొండనాలిక యగునొక్కగొమలితేకు.

* * *

* ఇట గ్రంథపాత మేమో ?

175 వ. అదె విద్వేషిభువన జిగీషాసంరంభ విజృంభ
మాణ ఝుషధ్వజ భుజపరాక్రమ సముత్సాహ
నాటక ప్రస్తావనా ప్రథమనాందీశ్లోకం బగు వేశ
వాటికానికటంబు.

176 గీ. చందనంబునఁ గలయంపి చల్లినారు
ముగ్గులిడినారు కాశ్మీరమున ముదమున
వ్రాసినా రిందురజమున రంగవల్లి
కంజములఁ దోరణంబులఁ గట్టినారు.

177 వ. ఇదియెవ్వరియిల్లొకో! శోభనంబు ముడివడుచున్న
యది యనుచు నాకాశంబు వీక్షించి యచ్చటి
వారల నేమి యని యడిగిన.

మాచల్దేవి

178 శా. ద్వీపాంతంబున నుండి వచ్చితివె? భూ
దేవా! "ప్రశాంతం మహా
పాపం" సర్వజగత్ప్రసిద్ధసుమనో
బాణాసనామ్నాయవి
ద్యోపాధ్యాయి ప్రతాపరుద్రధరణీ
శోపాత్తగోష్ఠీప్రతి
ష్ఠాపారీణ నెఱుంగ వయ్యెదవె మా
చల్దేవివారాంగనన్.

179 వ. చిత్రశాలాప్రవేశంబు చేయుచున్నయది పుణ్యా
హవాచనకాలంబు మీరును బచ్చని పెండ్లి
కూటంబుఁ జూడవచ్చునది యనిన,

గీ. లెస్సగాక కిరాట! యీ లేమచరిత
180 మాడుదురు నాటకంబుగ నవనిలోన
దీనిఁ జూడంగఁ బోదమా యీనెపమున
నరసి చూతము మన కేమి యచట? ననుచు.

వ. అనుచుఁ బ్రవేశనాటితకంబునఁ జిత్రశాలఁజొచ్చి
181 పూతిమాషగోత్రుం డచ్చోటం బెండ్లికూటం
బున నిలువునం గై సేసి హంసతూలికాతల్పంబు
మీఁదం గూర్చున్న హావభావ విభ్రమవిలాసనిధి
మాచల్దేవిఁ గనుంగొని.

182 గీ. అంకుశాఘాతరేఖల నంద మొందు
గంధగజకుంభములతోడఁ గలహ మాడు
క్రొత్తనఖములతోడి నీ కుచభరమున
కతివ యభ్యుదయపరంపరాభివృద్ధి.

183 గీ. కల్లఁ జెప్పము విను నీకుఁ గలప్రసిద్ధి
డిల్లిసురతాణికిని లేదు పల్లవోష్ఠి
యాదిలక్ష్మికి నీకును భేద మేమి
యుదధి జనియింపకుండుట యొకటి దక్క.

184 గీ. ఓరుఁగంటిమాచాంబ పయోరుహాక్షి
పంచబాణావతారుని మంచిఁ జూచి
కంకణాలంక్రియాఝణాత్కార మెసఁగ
"నయ్యగారికి జోహారు" లనుచు మ్రొక్కె.

185 గీ. అగురుధూపాధివాసితాభ్యంతరంబు
మగువ నీమన్మథచ్ఛత్రమంటపంబు
సర్వయోషిదసామాన్యసౌష్ఠవంబు
కాచుఁ గావుత మోర్గంటికటకవిటుల.

186 వ. అనుటయు.

187 సీ. ఎందుండి వచ్చితి రీరు? కాసల్నాట
నుండి వచ్చితిమి మే ముత్పలాక్షి
యెవ్వారివారు మీ? రేము సంకృతి పూతి
మాషమాధవునికుమారవరుఁడ
మీదివ్యనామకం బేదియో? గోవింద
మంచనశర్మసమాహ్వయులము
మీర లిచ్చటికి రాఁ గారణం బెయ్యది?
చేరి మీబోంట్ల నాశీర్వదింప
నైన విచ్చేసి కూర్చుండ నవధరింపు
వార్చి వచ్చెద మటు పోయి వనరుహాక్షి
యిచ్చటికి వార్వఁ బోయెద రెఱుఁగఁ జెప్పుఁ
డక్కవాడకు మేము బ్రాహ్మణుల మగుట.

ఇక్కడ గ్రంథపాఠము ?

వ. చిత్రావలోకనంబు చేసి టిట్టిభునకు గోవింద
184 మంచనశర్మ యిట్లనియె.

చిత్రశాల

185 సీ. అదె దారువనభూమి, యసమనేత్రుఁడు వాఁడె,
సంయమీంద్రులపుణ్యసతులు వారె,
యదె కన్యకారత్న, మబ్జాసనుఁడు వాఁడె,
యదె రతిక్రీడావిహారశయ్య,
వాఁడె వైకుంఠుండు, వారె గోపస్త్రీలు,
యమునానదీసైకతాంత మదియె,
అదె యహల్యాదేవి, యమరాధిపుఁడు వాఁడె,
యదె పర్ణశాలికాభ్యంతరంబు,
చందురుఁడు వాఁడె, యదె బృహస్పతిపురంధ్రి,
జాలరియు నదె, శ్రీపరాశరుఁడు వాఁడె,
కుశికజుఁడు వాఁడె, యదె యింద్రుకొలువులేమ,
చిత్తజునిశౌర్య మెఱిఁగించెఁ జిత్రశాల.

190 ఉ. తియ్యనివింటిజోదు రతి
దేవిచనుంగవ నొత్తిగిల్లి యొ
య్యొయ్యన వంక చక్కఁబడ
నొత్తెడుఁ జూచితె పుష్పబాణముల్
మయ్యెర వ్రాసెఁ జిత్తరువు
మాఁగిలి మాఁగిలి; చిత్రకారుఁడా!

దయ్యము గాక; నీవిపస
దానము టిట్టిభ! పిని కీఁడగుణ్.

(91) వ. అనుచుఁ దద్గృహంబు నిర్గమించి పూర్వానుభూత యగుగాంధర్వీగృహంబు రోయువాఁడు కతిపయమందిరంబులకు నవల సిందువారలతికా కుడుంగం బడియాలంబున నెఱింగి యనుంగు మొగసాలం జొచ్చిన దాసదాసీజనంబు ససంభ్రమంబుగా నెదురేఁగి తోడ్కొని పోవం బోయి యభ్యంతరమందిరంబున మహోత్సవవ్యాపారపారీణయై యున్నయవ్వారముఖ్యం జేరి యాసనార్ఘ్యపాద్యాదిసముచితసత్కారంబులం బొంది సుఖాసీనుండై.

192 ఉ. గోత్రమువార లెల్లఁ గెడ
గూడినవారు వ్రతంబొ దేవతా
యాత్రయొ పండువో మనగృ
హంబున శోభన మేమి? శోభనం
బత్రిసమాన! నేఁటియప
రాహ్ణసమాగమవేళఁ బుష్యన
క్షత్రమునందు నీయనుఁగు
గాదిలికూఁతురు చూచు నద్దముణ్.

క. ఆవేళ నీవు బిడ్డకు
153 దీవనమంత్రంబు చెప్ప దీర్ఘాయు వగున్
లావణ్యంబు వివేకము
ప్రావీణ్యము వైభవంబు భాగ్యము గలుగున్.

154 గీ. ముకురపీఠావిధానంబు మొదల లేక
వెలపడంతికిఁ గారాదు విటునిఁ గవయ
యాయజూకున కెట్లు చేయంగ వచ్చు
నరణిసంగ్రహ మొనరింప కధ్వరంబు.

గీ. లంజెవారికి శ్రీమహాలక్ష్మి గాదె
155 దర్పణము విప్రముఖ్యగంధర్వగణము
పుణ్యచారిత్ర దృష్టాంతభూమి గాదె
దర్పణమ్ము వివర్తవాదముల కెల్ల.

ఉ. ఉన్మదమత్తకోకిలకు
156 హూంకలపంచమరాగరాగసం
పన్నహానీయమైనమధు
మానవుఁబున్నమనాఁడు బిడ్డకున్
మన్మథవేధదీక్ష పది
నాళ్ళగుమాత్రము నేతదర్థమై
సన్మతి నుండఁగా వలయు
జక్కనివాఁడవ యక్కవాడలోన్.

157 సీ. అదె నీకుమారిత మదనరేఖాకన్య
వదనరేఖావైభవమునఁ జంద్రు
దొరఁ గూర్చికొన్నది ధూర్తదేవత నిన్నుఁ
దండ్రిఁ బోలినయట్టితరళనయన
సాముద్రికాగమజ్ఞానపారీణులు
కడు భాగ్యసంపద గలది యండ్రు
భాగ్యసంపదకల్మి ప్రస్ఫుటం బయ్యెఁగా
మీర లిందుల వచ్చి మీఱియుంట
జనకుఁడవు కర్తవాజ్ఞవు సజ్జనుఁడవు
క్రొత్తలంజెలకాముండ వుత్తముఁడవు
తొడల నిడుకొని ముద్దుకూఁతునకు నీవు
మించుటద్దంబు చూపరా మంచిరాజ!

158 గీ. కేలఁ గ్రొమ్మించుటద్దంబు గీలుకొల్పి
మంచితొడమీఁద నొప్పారె మదనరేఖ
ముద్దునెమ్మోము లావణ్యమున జయించి
కువలయాప్తునిఁ జెఱ వెట్టుకొన్నకరణి.

159 క. దీవించి మంచి కూఁతురు
"శ్రీవర్ధస్వంబు" చెప్పి చెవి టిట్టిభసె
ట్టీ! వెస నిప్పింపుము సం
భావన నొక వెండి బిడ్డపసపున కనియెన్.

